# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పారనిపథకం''] కు ఆధారం పి. వేణుగోపాలరావు రచన.

స్త్రీ పురుషుల మధ్య ప్రేమ వారికి మాత్రమే సంబంధించినది. కాని మనిషిని సమాజంతో బంధించే బంధాలు ఎన్నో ఉంటాయి. మనిషి ఆ బంధాలకు సంబంధించిన నియమాలన్నిటినీ పాటించాలి. ప్రేమ కోసం వాటిని త్యాగం చేసిన వాడు ఉత్తమ మానవుడు అనిపించుకోడు. ఈ సత్యాన్ని మణిమేఖల గుర్తించి, పాటించింది. అది గ్రహించని విజయసింహుడు ఆమె నుంచి గుణపాఠం నేర్చుకున్నాడు.

సంపుటి 62 జనవరి '78 సంచిక 1

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




సంశ్రుత్య శైబ్య శ్శ్యేనాయ
స్వాం తనుం జగతీపతిః,
ప్రదాయ పక్షిణే, రాజన్,
జగామ గతి ముత్తమామ్. 1

[రాజా, శైబ్యు డనే రాజు (మాట ఇచ్చినందుకు) తన శరీరాన్ని డేగకు అర్పించి, ఉత్తమ లోకాలు పొందాడు.]

తథా హ్యలర్క స్తేజస్వీ
బ్రాహ్మణే వేదపారగే
యాచమానే స్వకే నేత్రే
ఉద్ధృత్య సుమనా దదౌ. 2

[అలాగే అలర్కు డనే మహనీయుడు ఒక బ్రాహ్మణుడు వేదపారగుడైనవాడు యాచించగా తన కళ్ళు పీకి ఇచ్చాడు.]

సరితాం తు పతి స్స్వల్పాం
మర్యాదాం సత్యమన్వితః
సత్యానురోధా త్సమయే
స్వాం వేలాం నాతివర్తతే. 3

[నదులకన్నిటికీ అధిపతి అయిన సముద్రుడు మాట ఇచ్చిన కారణంగా ఎలాటి స్థితిలోనూ అల్పమయిన వేలను–సముద్రపు ఒడ్డును–దాటకుండా ఉన్నాడు.]

---

సత్యవాక్కులు

---




# 55

క్రూరాక్షుడు శిబిచక్రవర్తి కథ చెప్పిన మీదట అరిమర్దనం దీప్తాక్షుడి అభిప్రాయం అడిగింది.

"నన్నడిగితే, పరివర్తన చెందిన మన శత్రువు, కాకి సహాయం తీసుకోవటమే మంచిదంటాను. వెనకటికి ముసలివాడి పడుచుభార్య కథలో దొంగ వల్ల కూడా మేలే జరిగిందిగద!" అన్నది దీప్తాక్షుడు.

"ఏమిటా కథ?" అని అరిమర్దనం అడగగా దీప్తాక్షుడు ఇలా చెప్పింది:

కామాతురు డనే వృద్ధవర్తకుడు ఉండేవాడు. అతనితో నలభైఏళ్ళు కాపరం చేసిన భార్య చనిపోగా, మర్నాడే అతను పదహారేళ్ళ బాలాకుమార్తెను పెళ్ళాడాడు. ఆ పిల్ల కోసం అతను ఆమె తల్లిదండ్రులకు చాలా డబ్బు ఇచ్చుకున్నాడు. కాని ఆ పిల్ల మనసు చెదిరిపోయి, వయసు మళ్ళిన భర్తను ప్రేమించలేక, అతని ఆలింగనాలకు లొంగలేదు.

ఒక రాత్రి భార్యా భర్త లిద్దరూ పడుకుని ఉన్నారు. ఎప్పటిలాగే ఆమె భర్తకు వీపుపెట్టి పడుకుని ఉన్నది. ఆ సమయంలో జెమాజెట్టీలాంటి దొంగ వారింట ప్రవేశించాడు. ఆమె వాణ్ణి చూసి హడలిపోయి, తన భర్తను గట్టిగా వాటేసుకున్నది. ఈ సంఘటన వర్తకుడిలో పులకింతలూ, ఆశ్చర్యమూ కలిగించింది.

"ఇన్నాళ్ళూ లేనిది, ఈ మనిషి ఉన్నట్టుండి నన్ను ఎందు కిలా గట్టిగా కౌగలించుకున్నది?" అనుకుంటూ అతను చుట్టూ చూడటంలో మూల నిలబడిన దొంగ కనిపించాడు.

"నాయనా, నా స్పర్శ అంటే రోతపడే మనిషి, ఇవాళ నీ ధర్మమా అంటూ

నన్ను కౌగిలించుకున్నది. నీకేం కావాలో తీసుకుపో,'' అన్నాడు వర్తకుడు.

దొంగ మనసు కరిగింది. వాడు వర్తకుడితో, ''అయ్యా, నేను నీ ఇంటి నుంచి పూచికపుల్ల కూడా తీసుకోను. నీకు మేలు చేసినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. నిన్ను ఇలా ఈమె గాఢంగా కౌగలించుకోని రోజునే నేను మళ్ళీ వస్తాను,'' అన్నాడు.

ఈ కథ విని అరిమర్దనం వక్రనాసుడి అభిప్రాయం అడిగింది.

''రాజా, ఈ కాకిని చంపరాదు. శత్రువైనప్పటికీ, తన నాయకుడి అసంతృప్తి చెందినవాడి సహాయం మనం తీసుకోవచ్చు. బ్రాహ్మడూ, దొంగా, రాక్షసీ కథలో అదేగదా తేలేది?'' అన్నది వక్రనాసుడు.

''ఏమిటా కథ?'' అని అరిమర్దనం అడిగితే వక్రనాసుడు ఇలా చెప్పింది:

ఒక గ్రామంలో ఒక పేద బ్రాహ్మణుడుండేవాడు. అతను వారూ, వీరూ ఇచ్చిన దానితో జీవయాత్ర గడిపేవాడు. అతను ఎలాటి సుఖాలకూ నోచుకోలేదు. రోజూ క్షౌరం చేయించుకోవటానికిగాని, గోళ్ళు తీయించుకోవటానికిగాని అతని వద్ద డబ్బులుండేవి కావు. తిండి లేక అతను ఎండగట్టుకుపోయాడు.

ఒకనాడు ఒక ధనికుడు, తన తండ్రి చనిపోగా, ఆయనకు ఉత్తమ లోకాలు కలగగలందులకు, ఈ బ్రాహ్మడికి రెండు



లేగ దూడలను దానమిచ్చాడు. బ్రాహ్మడు వాటిని చక్కగా మేపి, బలవబెట్టాడు. అవి మంచి ఆవులుగా తయారయాయి.

ఒక దొంగ ఆ ఆవుల మీద కన్నువేసి, వాటిని కాజేయ నిశ్చయించాడు. వాడు బ్రాహ్మడి ఇంటిని సమీపించబోతూ ఒక రాక్షసిని చూశాడు. ఆ రాక్షసి కోరలు భయంకరంగానూ, కళ్ళు పెద్దవిగానూ, చెక్కిళ్ళు లోతుగానూ ఉన్నాయి.

రాక్షసిని చూసి భయపడి దొంగ, "అయ్యా, తమరెవరు?" అని అడిగాడు.

"నేను రాక్షసిని. ఆ ఇంట్లో ఉన్న బ్రాహ్మణ్ణి తినటానికని వెళుతున్నాను. నువ్వెవరు?" అని రాక్షసి అడిగింది.

తాను దొంగననీ, బ్రాహ్మడి ఆవులను దొంగిలించటానికి పోతున్నాననీ దొంగ రాక్షసికి చెప్పాడు.

తరవాత ఇద్దరూ కలిసి బ్రాహ్మడి ఇంటికి వెళ్ళి, ఒకచోట నక్కి, తమ పనులు చూసుకునే అవకాశం కోసం నిరీక్షించసాగారు.

బ్రాహ్మడు పడుకుని నిద్రపోగానే రాక్షసి అతన్ని తినే ఉద్దేశంతో లేచింది.

అది చూసి దొంగ రాక్షసితో, "నువు బ్రాహ్మణ్ణి తిని కోలాహలం ప్రారంభం కాకముందే నన్ను గోవులను తీసుకు పోనీ!" అన్నాడు.

"నన్ను ముందు బ్రాహ్మణ్ణి తిననీ. నువు ఆవులను దొంగిలించేటప్పుడు అల్లరి జరిగి, నా పని కాస్తా పాడవుతుంది," అన్నది రాక్షసి.

ఇద్దరూ ఈ విధంగా వాదించుకుంటూ, గొంతులెత్తి, నేను ముందంటే నేను ముందని ఘర్షణపడసాగారు. ఈ గొడవకు బ్రాహ్మడు లేచాడు.

"బ్రాహ్మడా, ఈ రాక్షసి నిన్ను తింటుందట!" అన్నాడు దొంగ.

"బ్రాహ్మడా, ఈ దొంగ నీ గోవులు కాజేస్తాడట!" అన్నది రాక్షసి.

బ్రాహ్మడు మంత్రం చదివేసరికి రాక్షసి పారిపోయింది. అతను కేకలు పెట్టేసరికి దొంగా పారిపోయాడు.



# 193. ప్రాచీన షాంగ్ శిల్పకళ

గత 10 సంవత్సరాల తవ్వకాల ఫలితంగా చీనాలో క్రీ. పూ. 16–14 శతాబ్దుల మధ్య కాలంలో షాంగ్ బానిన సమాజపు సంస్కృతి ఎంతగా విస్తరించినదీ బయటపడింది. ముఖ్యంగా కాంస్య (కంచు) పాత్రల పనితనం అత్యున్నత స్థాయికి వచ్చింది. వీటిలో పానపాత్రలూ, వంటపాత్రలూ, "పూజా" పాత్రలూ ఉన్నాయి. చాలావాటి మీద వాటి సొంతదారైన బానిన యజమాని పేరు చెక్కి ఉన్నది. చిత్రంలో కనిపించేది "టింగ్" అనే తరగతి వంటపాత్ర. దాని ఎత్తు 100 సెంటిమీటర్లు. బరువు 82. 4 కిలోలు.






# మాయాసరోవరం

## 25

[ఆకాశంలో ఎగురుతున్న హంసల రథంలో నుంచి జారిపోయిన మాయాసరోవరేశ్వరుడు, అరణ్యంలో ఒకచోట నరభక్షక జాతి వాళ్ళు కాగబెడుతున్న నీటిబానలో వచ్చిపడ్డాడు. అతడు వాళ్ళతో తన వెంట వున్న వాళ్ళను గురించి చెప్పాడు. అందరూ వాళ్ళ కోసం అరణ్యంలో వెతుకుతూండగా, సిద్ధసాధకుడు పెట్టిన కేక వినిపించింది. తరవాత--]

సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ పెట్టిన కేకకు మాయాసరోవరేశ్వరుడు ఉన్న చోటునే ఆగి, దిక్కులు చూస్తూ, వడవడ వణికిపోవటం చూసి, నరభక్షకుల గణాచారి చాలా ఆశ్చర్యపోయాడు. అతడి వెంట వున్న నలుగురు నరభక్షక జాతివాళ్ళూ, చప్పున ఈటెలు పైకెత్తి, ఆ కేక వినవచ్చిన వైపుకు బయలుదేరారు.

మాయాసరోవరేశ్వరుడు అంతలోనే తెప్పరిల్లి, గణాచారితో, "మీ వాళ్ళను తిరిగి రమ్మని పిలవటం క్షేమం. ఆ కేక వేసినవాడు మహాకాళుడి భక్తుడు. వాళ్ళ మంత్రశక్తుల ముందు, మీ ఈటెలు పూచికపుల్లల సాటిరావు," అన్నాడు.

ఆ మాటలకు గణాచారి బిగ్గరగా నవ్వి, "మా నరభక్షకులకు యిలాంటి మంత్ర తంత్రాల భయం ఏమీలేదు. మాకు



ఆహారం అయేందుకు, అరణ్యదేవర కరుణవల్ల మరొక మనిషి వస్తున్నాడు,'' అన్నాడు.

గణాచారి మాట ముగించేంతలో, ఈటెలు పైకెత్తి ఉత్సాహంగా ముందుకు పోయిన నలుగురు నరభక్షకులూ చావు కేకలు పెడుతూ, చెట్లకు అడ్డంపడి పరిగెత్తి, గణాచారి దగ్గిరకు వచ్చి, ''గణాచారయ్యో, మన ప్రాణాలు దక్కవు! ఏనుగంత నరవానరం మీద, యమకింకరు డొకడు కేకలు పెడుతూ యిటుకేసే వస్తున్నాడు,'' అన్నారు.

ఈసారి మాయాసరోవరేశ్వరుడితో పాటు, గణాచారి కూడా వణికిపోయాడు. అతడికి దూరంగా ఒక చెట్టుచాటు నుంచి శూలం పైకెత్తి, నరవానరాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, తమను సమీపిస్తున్న సిద్ధ సాధకుడు కనిపించాడు.

''ఒరే, యిక మనం యిక్కణ్ణించి పారిపోవటం మంచిది. ఒకడు ముందుగా పరిగెత్తిపోయి బెబ్బులిదొరకు, యీ యమ కింకరుణ్ణి గురించి చెప్పండి. వీడి చేతిలో పడ్డామో మన జాతి సర్వ నాశనమే!'' అంటూ ముసలి గణాచారి పారిపోయేందుకు వెనుదిరిగాడు.

సిద్ధసాధకుడు, ''మహాకాళా!'' అంటూ మరోసారి కేకపెట్టి, పారిపో జూస్తున్న నరభక్షకుల ముందుకు నర వానరంతో వచ్చి నిలబడి, ''కదిలా రంటే, మిమ్మల్ని నా నరవానరానికి బలిపెడతాను. ఎవరు మీరు? కాంచన మాల అనే రాజకుమారి హంసలరథం మీది నుంచి యిక్కడ జారిపడింది. చూశారా?'' అన్నాడు కళ్ళెర్రచేసి.

సిద్ధసాధకుడు అన్నమాటల్లో ఒక్కటీ గణాచారికిగాని, అతడి వెంట వున్న నరభక్షకులకుగాని అర్థం కాలేదు. గణాచారి చప్పున ఏదో గుర్తుకువచ్చిన వాడిలా పక్కకు తలతిప్పి, ఒక చెట్టుకొమ్మల చాటున నిలబడి, పారి పోయే ప్రయత్నంలో వున్న మాయా




సరోవరేశ్వరుణ్ణి చూసి, సాధకుడికి చేయెత్తి అతణ్ణి చూపిస్తూ, "మా అరణ్య దేవర ఆకాశం నుంచి మాకు ఆహారంగా పంపినవాడక్కడున్నాడు? మీరు చెప్పే రాజకుమారి సంగతి వాడికేమైనా తెలుసేమో అడగండి," అన్నాడు.

ఆ క్షణంవరకూ సిద్ధసాధకుడు, నరభక్షకుల్ని పారిపోకుండా చూసే ప్రయత్నంలో వుండి, కొంచెం ఎడంగా చెట్టు చాటున నిలబడిన సరోవరేశ్వరుణ్ణి చూడలేదు. ఇప్పుడతడు చప్పున తల తిప్పి చూసి, "ఒరే, నెత్తిన డిప్ప కిరీటం నువ్వూ! నువ్వేనా మాయా సరోవరేశ్వరుడివి? దొంగలా పారిపోవాలని చూస్తున్నావా? జాగ్రత్త, శూలానికి గుచ్చి భూమిలో పాతెయ్యగలను," అన్నాడు.

సాధకుడి మాటలు సరోవరేశ్వరుడికి చాలా కోపం తెప్పించినై. అతడు విసురుగా కత్తి పిడిమీద చేయివేసి, కత్తి దూయ బోయినవాడల్లా తమాయించుకుని, "నీ వేషభాషలు చూస్తూంటే, నువ్వేదో కాపాలికుడివని తప్ప నీ ఊరూ, పేరూ తెలియటం లేదు. సరిసమానులపైన మాత్రమే నేను కత్తి దూయగలను. ఇక యింతటితో నీ పరుష వాక్యాలు చాలించి, నీ దారిన నువ్వుపో," అన్నాడు యీసడిస్తున్నట్టు.

'నేను సిద్ధసాధకుణ్ణి, మహాకాళుడి భక్తుణ్ణి. నీ అంతస్తుకు తగిన శత్రువు నా బంటుగా వున్నాడు. వాణ్ణి నేనిటు వచ్చేప్పుడు చుట్టుపక్కల రాజకుమారి కాంచనమాల కోసం వెతకమని పంపాను. వాణ్ణి పిలవమంటావా?" అని, సిద్ధసాధకుడు గొంతెత్తి, "ఒరే, జలవృకా, ఎక్కడ? మీ జాతిశత్రువైన మాయా సరోవరేశ్వరుడిక్కడున్నాడు. వచ్చి, వాడి బలదర్పాలేమిటో పరీక్షించు," అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే సాధకుడి బంటయిన జలవృకరాక్షసుడు దూరం నుంచి జవాబుగా ఒక కేకపెట్టి, ముళ్ళపొదల

మీదుగా దూకుతూ, జబ్బలు చరుస్తూ, "ఎక్కడ? ఆ దురాత్ముణ్ణి, నా రాతి గదతో పిండికింద కొడతాను," అంటూ అరిచాడు.

జలవృక రాక్షసుడు అలా వేగంగా వస్తూన్న సమయంలో ఒకపెద్ద టేకు మాను చాటునుంచి చప్పున మకరకేతు తన జలగ్రహం మీద ముందుకువచ్చి, అతడి దారిని అడ్డగించాడు. జలగ్రహం పెద్దగా ఘీంకరించి తొండం సాచి జల రాక్షసుణ్ణి పట్టుకోబోయింది. జల రాక్షసుడు ఒక్క ఎగురున పక్కకు పోయి, మెరుపు వేగంతో వెనుదిరిగి, చేతగల రాతి గదతో, జలగ్రహం తల మీద ఒక్క బాదు బాదాడు. ఆ దెబ్బకు జలగ్రహం పక్కకు ఒరిగింది. మకర కేతుడు భీకరంగా ఒక కేకపెట్టి, "ఒరే, జలవృక రాక్షసుడా! నిన్నిదే యమ లోకానికి పంపుతున్నాను," అంటూ కత్తితో అతడి కంఠం మీద పొడవ బోయాడు. కాని, కత్తి గురితప్పి జల వృకరాక్షసుడి భుజాన్ని చీరింది.

నరవానరం మీద వుండి యిదంతా చూస్తున్న సిద్ధసాధకుడు, తన బంటు గాయపడగానే ఎక్కడలేని ఆవేశంతో ఒక కేకపెట్టి, "తరవాత జయశీలుడు ఏమైనా అనుగాక, ముందు యీ సరోవరం గాణ్ణీ, ఆ నీటి మొసలినీ నా శూలంతో చిత్రవధ చేస్తాను," అంటూ నర వానరాన్ని అదిలించాడు.



అ మరుక్షణం చుట్టూ చప్పట్లూ, ఈలలూ చెలరేగినై. సిద్ధసాధకుడు ఆశ్చర్యపోతూ తల తిప్పి చూశాడు. ఇప్పుడు ఆ చుట్టుపక్కలవున్న చెట్ల వెనకా, పొదలచాటునా చాలా మంది నరభక్షకులు చేరారు. వాళ్ళల్లోంచి వాళ్ల నాయకుడైన బెబ్బులిదొర ఈటె భుజాన పెట్టుకుని ముందుకువస్తూ, గణాచారితో, "గణాచారీ! అరణ్యదేవర మనకు ఆహారంగా యింతమందిని ఒక్కసారిగా పంపటం ఆశ్చర్యంగా లేదా? ఆహాఁ, ఆయన భక్తుల పాలిటి తేనెపట్టుగదా!" అన్నాడు.




బెబ్బులిదొర మాటలూ, అతడి జాతి వాళ్ళయిన నరభక్షకులు లొట్టలువేస్తూ తమనుచుట్టు ముట్టేందుకు వస్తూండటం గమనించిన సిద్ధసాధకుడు, యిప్పుడు తన శత్రువులతోపాటు తనకూ ప్రాణాపద రానున్నదని గుర్తించి, ఒక్కదూకున నరవానరాన్ని మకరకేతు దగ్గిరకు పరిగెత్తించాడు.

మకరకేతు గాయపడిన జలగ్రహం తల మీద చేతులతో తట్టి, అది లేచి నిలబడగానే, దాని మీద ఎక్కి కూర్చోబోయిన వాడల్లా ఆగి, అంత దూరంలో వున్న మాయాసరోవరేశ్వరుడితో, "సరోవరేశ్వరా, దయచేసి యీ జలగ్రహాన్ని అధిష్ఠించండి. ఈ సిద్ధసాధకుడు దురావేశపరుడేగాని, మంచివాడు. ఇతడి మిత్రుడైన జయశీలుడు మనందరికీ మిత్రుడు. వైద్యదేవుడూ, అతడూ కలిసి హంసలరథంలో త్వరలోనే యిక్కడికి రానున్నారు," అన్నాడు.

నది ఒడ్డున జరిగిన సంగతులేవీ తెలియని మాయాసరోవరేశ్వరుడికి, మకరకేతు మాటలే మాత్రం అర్థంకాలేదు. అయినా జలగ్రహం మీద వుండటం తనకు రక్షణగా వుంటుందని అతడు అడుగులో అడుగువేసుకుంటూ దాన్ని సమీపించాడు. ఈలోపల మకరకేతు వల్ల కత్తి దెబ్బ తిని బాధతో కింద పడిపోయిన జలవృక




రాక్షసుడు మూలుగుతూ చెట్టుబోదె నొక దాన్ని పట్టుకుని లేచి నిలబడి, సిద్ధ సాధకుడు కంటబడగానే, "దొరా, ఏమిటి సెలవు ?" అన్నాడు.

"నీకు తగ్గిలిన గాయం అంత ప్రమాద కరమైనది కాదనుకుంటాను. ముందు నీ రాతిగదను చేతికి తీసుకో," అని సిద్ధ సాధకుడు మకరకేతును," ఇప్పుడు ఎవరి నుంచి ఎవరికి ప్రమాదం రాబోతున్నదో గమనించావా ?" అని అడిగాడు.

"ఈ నరభక్షకులు అరణ్యదేవర మనను, తమకు ఆహారంగా పంపాడని భ్రమపడుతున్నట్టున్నది. ముందు యీ క్రూరులనుంచి మనం మనను కాపాడుకో వాలి," అన్నాడు మకరకేతు కత్తి పిడిని గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుంటూ.

"కేతూ, నీ తెలివికి మెచ్చాను. రాజు కనకాక్షుడి పిల్లలను వెతికి రక్షించి, ఆయనకు ఒప్పచెప్పకుండా నేనుగాని, జయశీలుడు గాని ఏ నరభక్షకులకూ ఆహారం అయిపోదలచలేదు. ఈ అనా గరికులకు ముందు మంచిగా చెప్పి చూస్తాను. వినకపొయ్యారో, అందరినీ— ఆడవాళ్ళనూ, పిల్లలనూ వదిలి— ఊచకోతకోద్దాం," అన్నాడు సాధకుడు.

నరభక్షకుల గణాచారి అప్పటివరకూ పూనకం వచ్చిన వాడిలా కళ్ళు మూసుకుని అటూ యిటూ ఊగుతున్న వాడల్లా, చప్పున ఎగిరి ఒక గంతేసి, "అరణ్యా దేవరో !" అంటూ ఒక కేక పెట్టి, "ఆకలి ! ఆకలి ! ఒరే, అరణ్యదేవర ఆహారంగా పంపిన మనుషుల్లారా, అలా చూస్తారేం ? కదలండి, అరణ్యదేవర ఆలయానికి. అక్కడ ముందుగా మిమ్మల్ని నైవేద్యం పెట్టి, తరవాత తినేస్తాం," అన్నాడు.

సిద్ధసాధకుడు తొణక్కుండా శూలం ఎత్తి పట్టుకుని, "ఒరే, నరమాంస భక్షకులారా, మీరు పొరబడుతున్నారు. మేం ఎవరిచేతా మీకు ఆహారంగా పంప బడ్డ వాళ్ళం కాదు. హంసలరథం మీది

నుంచి జారి అరణ్యంలో పడిన మావాళ్ళ కోసం వెతుకుతూ యిటువచ్చాం. ఆ పడిన వాళ్ళలో మాయాసరోవరేశ్వరు డనే వాడు మాకు దొరికాడు. ఇక మా దారిన మేం పోతాం. మీరు కూడా మంచిగా, బుద్ధిగా మీ దారిన మీరు పొండి,'' అన్నాడు.

''మా ఆకలి మాటేమిటి? వారాల తరబడి మేం తినేందుకేం దొరకక ఉపవాసాలు చేస్తున్నాం,'' అన్నాడు బెబ్బులిదొర ఈటెను ఝళిపిస్తూ, సిద్ధ సాధకుడి ముందుకువచ్చి.

"నువ్వు, మాయాసరోవరేశ్వరు డనే మనిషిని, మా అరణ్యదేవర ఆకాశం నుంచి సూటిగా మేం మాంసం ఉడక బెట్టే బానలోకి దించాడు. ఆ మాట అబద్ధమా?'' అంటూ గణాచారి చిందులు ప్రారంభించాడు.

సిద్ధసాధకుడు హెచ్చరించగానే నర వానరం, బెబ్బులిదొరను రెండుచేతులతో ఒడిసి పట్టుకుని పైకెత్తింది. మాయా సరోవరేశ్వరు డెక్కివున్న జలగ్రహం ఒక్కదూకున ముందుకువచ్చి తొండం సాచి, గణాచారిని నడుందగ్గిర పట్టుకుని గాలిలో గిరిగిరా తిప్పసాగింది. బెబ్బులి దొరా, గణాచారీ చావుకేకలు పెడుతూనే మధ్య మధ్య, ''మన ఆహారం అయిన యీ మనుషుల్ని వదలకండి, ఈటెలతో పొడవండి!'' అంటూ అరవసాగారు.

''చూస్తావేం, జలవృకభటా! ఈ నర భక్షకుల్ని నీ రాతిగదతో పిండికింద



కొట్టు,'' అంటూ సిద్ధసాధకుడు జలవృక రాక్షసుణ్ణి హెచ్చరించాడు.

''సిద్ధసాధక దొరకూ, జై!'' అంటూ జలవృకరాక్షసుడు రాతిగద ఎత్తి, నర భక్షకుల మీదికి విరుచుకుపడ్డాడు. ఆకలితో ప్రాణాలకు తెగించిన నర భక్షకులు వాణ్ణి ఎదిరించారు. జల రాక్షసుడు గదతో అందిన వాళ్ళను అందినట్టు ఎడాపెడా కొడుతూండగా, నరభక్షకులు వాణ్ణి ఈటెలతో పొడి చేందుకు ప్రయత్నిస్తూ, తమ కేకలూ, అరుపులతో ఆ అరణ్య ప్రాంతమంతా ప్రతిధ్వనించేలా చేయసాగారు.

సిద్ధసాధకుడు కొంచెంసేపు తన జలవృకభటుడు పోరాడుతున్న తీరు చూసి, ''భేష్, జలవృకభటా! నీవు పౌరుషశాలివి, ధైర్యవంతుడివి! నీకు సాయం వస్తున్నాను,'' అంటూ కేకపెట్టి, నరవానరం చేతుల్లో వున్న బెబ్బులి దొరను దూరంగా విసిరి వేయించి, ''జై, మహాకాళా!'' అంటూ శూలం ఎత్తి, నరభక్షకుల మీదికి నరవానరాన్ని ఉరికించాడు.

ఆ మరుక్షణం పదిమంది అశ్వికులు వేగంగా అక్కడికొస్తూ, ''ఆగండి! ఆగండి! ఇది హిరణ్యపురం రాజైన కనకాక్ష మహారాజుగారి ఆజ్ఞ!'' అంటూ అరిచారు.

అశ్వికుల హెచ్చరిక వింటూనే సిద్ధ సాధకుడూ, నరభక్షకులూ పోరాటం మాని ఆశ్చర్యంగా వాళ్ళ కేసి చూడ సాగారు. మాయాసరోవరేశ్వరుడు వణికిపోతూ, ''మకరకేతూ! మనం వేగంగా మాయాసరోవరాన్ని చేరటం క్షేమం గదా?'' అన్నాడు.

ఆ మాటలు విన్న సిద్ధసాధకుడు కోపంతో కళ్లెర్రచేసి, ''ఒరే, దుష్ట సరోవరేశ్వరా! నువ్వు ఎక్కడికీ పారి పోలేవు. నువ్వు క్షేమం అనుకునేది, కీడుగా పరిణమించబోతున్నది, జాగ్రత్త!'' అంటూ శూలాన్ని అతడి గుండెలకు ఆనించాడు. —(ఇంకావుంది)






# పారని పథకం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు నీ వాగ్దానం ఏదైనా నిలబెట్టుకునేటందుకు ఇలా శ్రమపడుతున్నావేమో తెలియదు. కాని కొన్ని పరిస్థితులలో అన్న మాట నిలబెట్టుకోవటం అసాధ్యమవుతుంది. అందుకు నిదర్శనంగా నీకు మణిమేఖల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం మాళవదేశానికీ, పాంచాల దేశానికీ బద్ధవైరం ఉండేది. మాళవ దేశపురాజు వీరసేనుడికి విజయసింహుడు అనే కుమారుడు ఉండేవాడు. పాంచాల రాజైన విమలాదిత్యుడి కుమార్తె మణి

## బేతాళ కథలు



మేఖల, అతిలోక సౌందర్యవతి. అందుచేత విమలాదిత్యుడు ఆమెకు స్వయంవరం నిర్ణయించి, దేశదేశాల రాజులకు ఆహ్వానాలు పంపినప్పుడు వయసు మళ్లిన రాజులు కూడా ఆమెను పెళ్ళాడాలన్న ఆశతో స్వయంవరానికి బయలుదేరారు.

అయితే విమలాదిత్యుడు తన శత్రువైన వీరసేనుడి దివాణానికి ఆహ్వానం పంపలేదు. వీరసేనుడికి చాలా కోపం వచ్చింది. ఎందుకంటే ఆయన మణిమేఖలను పెళ్ళాడాలని ఉవ్విళ్ళూరుతూ వచ్చాడు.

అందుచేత వీరసేనుడు తన కొడుకైన విజయసింహుణ్ణి పిలిచి, ''నువు తక్షణం మన బలాలను తీసుకుని పాంచాలదేశం మీదికి యుద్ధానికి వెళ్లి, పాంచాల రాజును ఓడించి, అతని కుమార్తె అయిన మణిమేఖలను బందీగా పట్టుకురా. నేను ఆమెను వివాహమాడ నిశ్చయించుకున్నాను,'' అన్నాడు.

విజయసింహుడు పాంచాలదేశం మీదికి దండెత్తి వెళ్ళి, యుద్ధంలో జయించాడు. విమలాదిత్యుడు పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు. మిగతా రాజకుటుంబం విజయసింహుడికి బందీలుగా దొరికిపోయారు. విజయసింహుడు మణిమేఖలను సకల మర్యాదలతో తన సమక్షానికి తెప్పించుకుని, ఆమె అందం చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు.

అయితే అతను వెంటనే తేరుకుని, ''రాకుమారీ, మిమ్మల్ని పెళ్ళాడాలని మా తండ్రిగారు గాఢంగా వాంఛిస్తున్నారు. అందుచేత రేపు నా వెంట మా దేశానికి ప్రయాణం కావటానికి సిద్ధంగా ఉండండి,'' అన్నాడు.

మణిమేఖల అతని మాటలను మౌనంగా విని, తన మందిరానికి తిరిగి వెళ్లింది.

ఆ రాత్రి విజయసింహుడు మణిమేఖల అందాన్నే తలుచుకుంటూ, నిద్రపట్టక

తన శయనా మందిరంలో పచార్లు చేస్తూండగా, ఒక పరిచారకుడు మణి మేఖల నుంచి ఒక లేఖ తెచ్చి అతనికి ఇచ్చాడు. అందులో ఇలా ఉన్నది:

"వీరోచితంగా సాధించుకున్న దాన్ని ఇతరులకు ధారపోయడం సముచితం కాదు."

మణిమేఖల తననే వివాహమాడ గోరుతున్నదని విజయసింహుడికి అర్థ మయింది. అసలే అతను మణిమేఖల మీది మోహంతో తపించిపోతున్నాడు. ఆమె ఇలా కబురు చేసిన మీదట అతను ఆమెను వివాహమాడ నిశ్చయించాడు. మర్నాడు మాళవదేశానికి తిరుగు ప్రయాణం వాయిదాపడింది. ఆ రోజే విజయసింహుడు మణిమేఖలను వివాహ మాడాడు.

ఆ రాత్రి అతను తన వధువును కలుసు కోవటానికి శయ్యామందిరానికి వెళ్ళి, రతీదేవిలాగా ముస్తాబై ఉన్న మణి మేఖలను సమీపించాడు. అకస్మికంగా ఆమె తన చీర మడతలలో నుంచి చుర కత్తి తీసి, అతన్ని గుండెలలో పొడవ టానికి ప్రయత్నించింది.

విజయసింహుడు ఆమె చేతిని గట్టిగా పట్టేసి, చురకత్తి కిందపడినదాకా చేతిని పీడించి, "నన్ను ప్రేమించినట్టు నటించి, పెళ్ళి కూడా చేసుకుని, నన్ను చంప టానికి ఎందుకు ప్రయత్నించావు? నిజం చెప్పు. నేను నిన్ను శిక్షించను," అన్నాడు.



"యుద్ధానికి ముందు నా తండ్రి, పరిస్థితి తారుమారై, తనకు అపజయం సిద్ధిస్తే పగతీర్చుకోమని నన్ను ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞ నిర్వర్తించటానికి యత్నించాను. అయితే నేను మిమ్మల్ని ప్రేమించినట్టు చెప్పిన మాటలో అసత్యం ఏమీలేదు. మీరు నన్ను ఏ విధంగా శిక్షించినా నేను అభ్యంతరం చెప్పను," అన్నది మణిమేఖల.

విజయసింహుడు కొద్దిసేపు ఏదో ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి, ఎటో వెళ్లిపోయాడు. తరవాత అతను ఏమైనదీ ఎవరికీ తెలియదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విజయసింహుడు తాను ప్రేమించిన మణిమేఖలను వదిలేసి ఎందుకు వెళ్ళిపోయాడు? ఆమె తనను చంపటానికి ప్రయత్నించటాన్ని క్షమించలేకనా? ఆమె తనను ప్రేమిస్తున్నట్టు ఒప్పుకున్నది గద. అలాటప్పుడు ఆమెను అనాథగా ఎందుకు వదిలేశాడు? అతను కనీసం తన దేశానికైనా తిరిగి ఎందుకు పోలేదు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విజయసింహుడు మణిమేఖలను వదిలెయ్యటంలో అతని దోషమేమీ లేదు. ఆమె ప్రయత్నం ఫలించి, అతను చచ్చిపోయి ఉంటే ఆమె ఎలాగూ అనాథ అయి ఉండేదే. అతను వెళ్ళిపోవటానికి అసలు కారణం, అతను మణిమేఖల నుంచి నేర్చుకున్న గుణపాఠం. ఆమె అతన్ని ప్రేమిస్తూ కూడా తండ్రి ఆజ్ఞ పాలించ యత్నించింది. అతను ఆమె మీది ప్రేమతో తన తండ్రి ఆజ్ఞను తోసిపుచ్చాడు. అందుకే అతను స్వదేశానికి తిరిగి వెళ్ళక, నామరూపాలు లేకుండా పోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





శంకా మహారాజు ధైర్యసాహసాలూ, వివేకమూ గల రాజు. ఆయన బ్రాహ్మణుడు కావటంచేత ఆయన అస్థానోద్యోగులు అధికంగా బ్రాహ్మణులు. ఆయన మంత్రి మాత్రం క్షత్రియుడు. శంకా మహారాజుకు ఎలాటి శత్రుభయమూ లేదు. ఆయనను చూసి అందరూ గజగజలాడేవారు గానీ, ఏటా ఆయనను గజగజలాడిస్తూ వచ్చిన శత్రువు వరద. వానాకాలంలో సుందరీనది పొంగి రాజధానికి తీరని నష్టం కలిగించేది. నదిని అరికట్టి అదుపులో ఉంచటానికి రాజు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు.

ఆ నగరంలోనే ఒక చెప్పులు కుట్టేవాడి కొడుకు లోచనుడు అనేవాడు చిన్నతనంలోనే ఎటో వెళ్ళిపోయాడు. వాడు మంత్రవిద్యలు నేర్వటానికి కామరూప దేశం వెళ్ళాడని కొందరూ, యంత్ర విద్యలు నేర్వటానికి కర్మపురం వెళ్లాడని మరికొందరూ అనుకున్నారు. పదిహేనేళ్ల అనంతరం లోచనుడు తిరిగి వచ్చాడు. వాడు బలాఢ్యుడుగా తయారయాడు. వాడి ముఖంలో తేజస్సూ, కళ్ళలో కాంతీ కనిపిస్తున్నాయి.

లోచనుడు తిరిగి వచ్చినందుకు వాడి బంధువర్గం అంతా సంతోషించి, ఎక్కడికి వెళ్లావు, ఏం చేశావని అడిగారు. తన తల్లి వరదలో కొట్టుకుపోవటం కళ్లారా చూసిన క్షణం నుంచీ సుందరీ నదిని ఎలా అదుపులోకి తేవాలా అన్న ఆలోచన తనను వెంటాడిందనీ, ఆ విద్య నేర్చుకునేటందుకు తాను చాలా దేశాలు తిరిగి, చివరకు వరదలను నిగ్రహించే విద్య నేర్చుకున్నాననీ, ఇప్పుడు తాను ఎలా చెబితే నీరు అలా నడుచుకుంటుందనీ అన్నాడు. వాడు శంకా మహారాజుగారిని



కలిసి మాట్లాడటానికి నిశ్చయించుకున్నాడు.

అయితే శంకామహారాజు ఎంత వివేకి అయినా అయనకు అస్పృశ్యతలో నమ్మకం ఉన్నది. ఒక చెప్పులు కుట్టే వాడి కొడుకు వరదలను అదుపు చెయ్యటం నమ్మదగినమాట కాదనీ, అతనికి దర్శనం ఇయ్యటం అనవసరమనీ రాజుతోబాటు, అతని బ్రాహ్మణమంత్రులు కూడా తల పోశారు.

ముఖ్యమంత్రి ధర్మపాలుడు మాత్రం ఉదారుడూ, విశాల హృదయుడూనూ. ఆయన రహస్యంగా లోచనుణ్ణి కలుసుకుని చాలా దీర్ఘ చర్చలు జరిపి, వరదల సమస్యను పరిష్కరించటానికి గల వివిధ ప్రక్రియలు లోచనుడికి తెలుసునని గ్రహించాడు. అయితే రాజునూ, ఆయన వెంట ఉండే శ్రోత్రియ బ్రాహ్మణులనూ నమ్మించటం అంత తేలిక కాదు.

"నీటిని అదుపులో ఉంచగలనని రాజోద్యోగులను నమ్మించటానికి నువు ఏమైనా ప్రయోగం చెయ్యగలవా?" అని మంత్రి లోచనుణ్ణి అడిగాడు.

"ఆలోచించాలండి," అన్నాడు లోచనుడు.

లోచనుణ్ణి దర్బారుకు పిలిపించి, అతడికి నీటి మీద నిజంగా అధికారం ఉన్నదీ లేనిదీ రుజువు చేసుకోవటం మంచిదని మంత్రి రాజును ఎలాగో కష్టపడి ఒప్పించాడు.

"గంగామాత తనకు అనుకూలమయిందని లోచనుడు అంటాడా ఏం?" అని రాజు అడిగాడు.

"జలప్రవాహాన్ని ఆపేశక్తి తన కున్నదనీ, సభలో ఆ మాట నిరూపించగలననీ వాడు అంటున్నాడు." అన్నాడు మంత్రి.

రాజు అనుమతించిన మీదట లోచనుడు అనుకున్న వేళకు సభకు వచ్చాడు. వాడి వెంట ఒక డబ్బా, ఆరంగుళాలు ఎత్తూ, మూడంగుళాలు వ్యాసమూ గలది ఉన్నది. దానికి గట్టిగా

పట్టే మూత ఉన్నది. అందులో కొన్ని సన్నటి బెజ్జాలున్నాయి.

"ఈ డబ్బాలో నీరుపోసి, మూత గట్టిగా బిగించి తలకిందులు చేస్తే, మూతలోని చిల్లులకుండా నీరు ధారలుగా వస్తుంది. చూడండి," అంటూ లోచనుడు డబ్బాలో నీరుపోసి, మూత బిగించి, తలకిందులు చేశాడు. మూతలోని చిల్లుల కుండా నీటి ధారలు వచ్చాయి.

"గంగామాతా! దయచేసి నిలిచిపో!" అన్నాడు లోచనుడు.

వెంటనే ధారలు ఆగిపోయాయి.

కొంచెంసేపు ఆగి, "మాతా, మళ్ళీ ప్రవహించు!" అన్నాడు లోచనుడు. వెంటనే మళ్లీధారలు బయటికి వచ్చాయి.

"ధన్యుడివి! ధన్యుడివి!" అంటూ రాజు పరవశుడైపోయి, లోచనుణ్ణి కౌగలించుకున్నాడు. ఆస్థానబ్రాహ్మణులు రాజును అనుకరించక తప్పలేదు.

సుందరీ నది వరదలను అదుపు చెయ్యటానికి లోచనుడికి అనుమతి లభించింది. నది ఎగువన కి
మొదలుకుని, మైదానం దాకా
ప్రాంతాల నదికి ఆనకట్టలు ని
చేసి, అనేక ప్రాంతాల నది నీరు
ఉండటానికి జలాశయాలు క
లోచనుడు వరదల వల్ల నష్టం
కుండా చూడటమేగాక, వేసవి క
నది ఎండినప్పుడు కూడా నది
ప్రజలకు లభించే సదుపాయాలు చే
రాజూ, అతని సలహాదార్లూ లో
ఆహ్వానించి, తమ పంక్తిన భో
చెయ్యనిచ్చారు. దేవుడు అందరి
లాగే సృష్టించాడు, హెచ్చు త
కల్పించినది మనుషులే!

డబ్బాలో నీటిని లోచనుడు
ఆపాడు? డబ్బాలో కింది అం
ఒక సన్నని రంధ్రం ఉన్నది.
లోచనుడు తన వేలితో మూసిన
ధారలు నిలిచిపోతాయి, వేలు ప
జరిపితే మళ్లీ ధారలు వస్తాయి. అ
గంగామాత అనుగ్రహం ఏమీలేదు



# విద్వాంసుడి ఎన్నిక

కళింగరాజుకు తన ఆస్థాన సంగీతవిద్వాంసుడి పాట అంటే ప్రాణం. కాని ఆ విద్వాంసుడు రామవర్మకు పిచ్చి ఎత్తింది. మరో విద్వాంసుణ్ణి నియమించవలసి వచ్చింది.

దేశంలో ఉన్న సంగీత విద్వాంసులలో రత్నపాలుడు గట్టివాడు. మంత్రి అతనితోబాటు మరికొంతమంది విద్వాంసుల సంగీతాన్ని రాజుకు వినిపించాడు. రాజుకు ఎవరి సంగీతమూ నచ్చలేదు. "రామవర్మ పాటలా లేదు!" అని రాజు, ఇతర దేశాలలో ఉన్న విద్వాంసులను పిలిపించమన్నాడు.

"దేశం గొడ్డుపోయినట్టు పొరుగుదేశాల వాళ్ళను ఆస్థాన సంగీతవిద్వాంసుడి ఎన్నికకు పిలవటమేమిటి?" అని కొలువులో వాళ్లు బాధపడ్డారు.

కాని మంత్రి పొరుగుదేశాల వాళ్ళను పాడటానికి పిలిపించాడు. అయితే వారికి ముందే డబ్బు ఇచ్చేసి, "మీరు మరీ తన్మయులై పాడితే రాజు ఏం చేస్తాడో చెప్పలేను. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

వారి సంగీతం విన్నమీదట రాజు రత్నపాలుడి సంగీతమే బాగున్నదని, అతన్ని ఆస్థాన విద్వాంసుడుగా నియమించాడు.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# అధర్మ సత్రం

విమలాపురం జమీందారీ గ్రామం. జమీందారు ప్రజల రక్తం పీల్చే కర్కోటకుడు. ప్రజలకు అతనంటే అమితమైన ద్వేషం, కాని దాన్ని పైకి చూపటానికి సాహసించే వాళ్ళు కారు.

కుక్కతో గ్రామాల వెంట తిరుగుతున్న చిన్నడు విమలాపురం చేరుతూనే ఒక భవనం చూశాడు. దానిమీద "ధర్మసత్రం" అని రాసి ఉన్నది. చిన్నడు లోపలికి వెళ్ళేసరికి సత్రం నౌకరు కాళ్ళు కడుక్కునేటందుకు నీళ్ళిచ్చి, భోజనం చేస్తారా అని అడిగాడు. చేస్తానన్నాడు చిన్నడు.

"అయితే ముందుగా అయ్యగారిని కలవండి," అంటూ సత్రం అధికారి ఉండే గది చూపాడు నౌకరు.

అధికారి చిన్నడి పేరు రాసుకుని, "ఐదు రూపాయిలియ్యి," అన్నాడు.

"భోజనం ఖరీదు ఐదు రూపాయలా! ధర్మసత్రమని బయట రాసి ఉన్నదే?" అన్నాడు చిన్నడు.

అధికారి నవ్వుతూ, "అది భోజనం ఖరీదు కాదు. ఈ ఊళ్ళో త్వరలో ఒక శివాలయం కట్టించబోతున్నాం. అందు కోసం ఈ విధంగా డబ్బు వసూలు చెయ్యమని సత్రం ధర్మకర్తగారైన జమీందారుగారు ఆదేశం యిచ్చారు," అన్నాడు.

చిన్నడు భోజనం ఆలోచన వాయిదా వేసి, ఊళ్ళోకి నడిచాడు. వీధి వెంట నడుస్తున్న చిన్నడికి ఒక చోట ఒక దృశ్యం కనబడింది. ఇద్దరు దృఢకాయులు ఒక ఇంటి నుంచి ఒక ఆవును బలవంతంగా లాక్కుపోతున్నారు. ఆవు గలవాడు ఏడ్చి, తల బాదుకుంటూ ఆ ఇద్దరి కాళ్ళమీద పడ్డాడు. ఆ ఇద్దరూ

బూర్లె నాగేశ్వరరావు



వాణ్ణి పక్కకు నెట్టేసి, ఆవును తోలుకు పోయారు. చిన్నడు ఆ మనిషిని చూసి జాలిపడి, అతన్ని సమీపించి, "ఎవరు వాళ్ళు? అప్పులవాళ్ళా?" అని అడిగాడు.

"అదేమీలేదు, బాబూ. బాకీ ఉంటే బాధపడకపోదును. ఇది జమీందారుగారి పచ్చి నిరంకుశత్వం. మొన్నటిదాకా ధర్మసత్రం కట్టిస్తానని ఊళ్ళోవాళ్ళ రక్తం పిండాడు. అది కాగానే శివాలయం కట్టిస్తానంటూ ప్రారంభించాడు. ఇప్పటికి ఆయన వసూలు చేసిన డబ్బుతో ఎన్ని శివాలయాలైనా కట్టించవచ్చు," అన్నాడు.

చిన్నడికి జమీందారు మీద చాలా కోపం వచ్చింది.

"పేదలను పీడించి ధర్మసత్రాలూ, ఆలయాలూ కట్టించటం ఏమిటి?" అన్నాడు వాడు.

"డబ్బులేనివాళ్ళదగ్గిర ఇలాగే పశువులను తోలుకుపోతూంటాడు. మనం ఇట్లా అనుకున్నామని జమీందారుకు తెలిస్తే ఇద్దరినీ కాటికి పంపుతాడు," అన్నాడు ఆవును పోగొట్టుకున్నవాడు.

"ధర్మసత్రం యజమాని జమీందారయితే, అందులో అధికారిగా కూర్చునే వాడెవడు? వాడూ ఒక జమీందారులాగే ఉన్నాడే?" అని చిన్నడు అడిగాడు.

"ఉండకేం జేస్తాడు? వాడు జమీందారు బావమరిది. ఆవును లాక్కెళ్ళినవాళ్లు జమీందారుకు నమ్మినబంట్లు! ఎలుగుబంట్లు!" అన్నాడు ఆ మనిషి.

జమీందారూ, అతడి బావమరిదీ ఇద్దరు తోడేళ్ళు, వాళ్ళ కింద ఇద్దరు ఎలుగుబంట్లు! ఈ నలుగురూ చేరి అమాయకపు జనాన్ని చెండుకు తింటున్నట్టు చిన్నడికి అర్థమయింది. చిన్నడు వాళ్ళ సంగతి తేల్చిగాని ఆ గ్రామం నుంచి వెళ్ళరాదనుకున్నాడు.

కొద్దిరోజుల్లోనే చిన్నడు గ్రామస్థులందరినీ పరిచయం చేసుకుని, వాళ్ళ సహాయంతో ఒక పెద్ద నాటకం ఆడటానికి ఉపక్రమించాడు.

తరవాత వాడు జమీందారును కలుసుకుని, "ధర్మ ప్రభువులు! పది రూపాయలు పోతేపోయాయిగాని, సత్రంలో భోజన సదుపాయాలు బాగున్నాయి," అన్నాడు.

జమీందారు ఉలిక్కిపడి, "ఏమిటీ? పదేసి రూపాయలు తీసుకుంటున్నాడా?" అని అడిగాడు.

"ఫరవాలేదులెండి. పది రూపాయలు ఎక్కువేమీ కాదు. అందునా అది శివాలయం కట్టించటానికట గద!" అన్నాడు చిన్నడు.

"నువు చెప్పేది నిజమే అయితే వాడి చర్మం ఒలిచేస్తాను! నేను తీసుకోమన్నది అయిదు రూపాయలే. వాడు నన్ను మోసం చేస్తున్నాడంటావా? ఇంత పెద్ద ద్రోహమా!" అన్నాడు జమీందారు ఉగ్రుడైపోతూ.

చిన్నడు ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసి, "అలాగా? అయితే సత్రం సగం మింగేస్తున్నాడా? మనిషికి అయిదు రూపాయలా? ఎంతలేదన్నా రోజుకు యాభైమందికి పైగా సత్రానికి వస్తూంటారు గదా! అయ్యో! అయ్యో! ఎంత మోసం!" అన్నాడు.

జమీందారుకు మరింత మతిపోయినట్టయింది.



"రోజుకు యాభైమందే? అంతమంది వస్తున్నట్టు వాడు నాకు ఏనాడూ లెక్క చెప్పలేదే?" అన్నాడతను.

"మీరింత అమాయకులు గనకనే అతను మిమ్మల్ని ఇంత సులభంగా మోసం చెయ్యగలుగుతున్నాడు. కావాలంటే నా వెంట మీ మనిషిని ఒకరిని పంపండి. అతను చేసే మోసం కళ్ళారా చూడవచ్చు. నేను సత్రంలోనే గదా ఉంటున్నాను," అన్నాడు చిన్నడు.

జమీందారు చిన్నడి మాట నమ్మి వాడి వెంట తన మనిషిని పంపాడు. ఆ సాయంకాలం చిన్నడు ఆ మనిషితో సహా సత్రానికి ఎదురుగా మాటువేశాడు.



చిన్నడు తయారు చేసిన యువకులు జట్లు జట్లుగా, తలపాగాలు చుట్టుకుని ప్రయాణీకుల్లాగా సత్రంలోకి పోవటమూ, మరికొందరు భోజనం చేసినట్టు మూతులు తుడుచుకుంటూ, త్రేన్చుతూ బయటికి వస్తూండటమూ జమీందారు మనిషి చాలా సేపు చూశాడు. వాడు జమీందారు దగ్గిరికి వెళ్ళి, "ఈ ఒక్క పూటే యాభై, అరవైమంది దాకా ప్రయాణీకులు సత్రంలో భోజనంచేశారు," అన్నాడు.

ఆ మాటవిన్న జమీందారు కళ్ళు చింతనిప్పులల్లే అయాయి.

"శాంతించండి. ఇవాళ వచ్చినవారి సంఖ్య ఎంత చెబుతాడో చూసి మరీ చర్య తీసుకోవటం మంచిది," అని చిన్నడు జమీందారును అప్పటికి శాంత పరిచాడు.

మర్నాడు ఉదయం జమీందారు వద్దకు అతని బావమరిది వచ్చి సత్రం లెక్కలు చూపించాడు. సత్రంలో భోజనాలు చేసిన వారి సంఖ్య పన్నెండుగా చూపబడి ఉన్నది. అది చూడగానే జమీందారు శివమెత్తిపోయి, "ఒరే, పచ్చి దుర్మార్గపు, వెధవా! ఎన్నాళ్ళుగా ఇలా మోసం చేస్తున్నావు?" అంటూ కొరడా తీసుకుని అతణ్ణి చావగొట్టాడు.

దెబ్బలకు కారణం తెలియకా, దెబ్బలకు తట్టుకోలేకా జమీందారు బావమరిది అక్కడి నుంచి పారిపోయాడు. తను ఏదన్నా చెప్పుకుందామన్నా, అడుగుదామన్నా జమీందారు అవకాశం ఇవ్వలేదాయె!

చిన్నడు సత్రం చేరి జమీందారు బావమరిదిని పరామర్శిస్తూ, "ఏమన్న మనిషండీ? మీరూ తనంటివారే నన్నది గుర్తించకుండా గొడ్డును బాదినట్టు బాదటమా? పైగా మీ పుణ్యానేగదా తాను ఇంతటి వాడయింది? మీరు ఇందుకు ప్రతీకారం చెయ్యకపోతే నలుగురిలోనూ ఎలా తల ఎత్తుకు తిరుగుతారు?" అని ఎగదోశాడు.

"ప్రతీకారం ఎలా చేస్తే బాగుంటుంది?" అని జమీందారు బావమరిది చిన్నణ్ణి సలహా అడిగాడు.

"జమీందారుగారికి ఆ ఇద్దరు ఎలుగుబంట్లు తప్ప ఒక్క పురుగు అండగా నిలవదు. మీ తరఫున ప్రాణాలైనా బలిపెట్టగల యువకులను పాతికమందిని తీసుకురాగలను," అన్నాడు చిన్నడు.

జమీందారు బావమరిదికి ధైర్యం వచ్చింది. "అవును. ఊళ్ళో అంతా వాడి చావుకోసం ఎదురు చూస్తున్న వాళ్ళే. ఇప్పుడే వాడి అంతు చూస్తాను," అంటూ అతను కొరడా అందుకున్నాడు.

"శాంతించండి. తొందరపడితే వ్యవహారం చెడుతుంది. అతడే ఇక్కడికి వచ్చేలా చెయ్యాలి. మీరు ఒక పని చెయ్యండి—సత్రం మీద ధర్మకర్తగా జమీందారు పేరు చెరిపి, మీ పేరు రాయించండి, చాలు. మిగతా కథ అంతా నేను నడుపుతాను," అన్నాడు చిన్నడు.

జమీందారు బావమరిది చిన్నడు చెప్పినట్టే చేయించాడు. ఈ సంగతి క్షణాల మీద జమీందారుకు తెలిసింది. అతను కొరడా తీసుకుని తన బంట్లను ఇద్దరినీ వెంటబెట్టుకుని సత్రానికి వచ్చాడు.

"ఎవడ్రా, నీ కింత ధైర్యం ఇచ్చాడు? ధర్మకర్తగా నీపేరు రాయించుకుంటావా?



ఎన్ని గుండెలు?" అన్నాడతను పళ్ళు కొరుకుతూ.

"ఎందుకలా గొడ్డులాగా రంకెలు వేస్తావు? ఇది నీ బాబుగాడిదా? సొమ్ము ప్రజలది. కట్టించి, నిర్వహిస్తున్నది నేను. మధ్య నువు ధర్మకర్త వెలా అయావు?" అని బావమరిది అడిగాడు జమీందారు మీదికి వస్తూ.

"ఏంరా? ఏం కూశావ్?" అంటూ జమీందారు తన బావమరిది మీదికి ఉరకబోయాడు. అందుకు సిద్ధంగా ఉన్న బావమరిది జమీందారు ముఖం మీద కొట్టాడు. వెంటనే జమీందారు బంట్లు కలగజేసుకోబోయారు.

అంతదాకా ప్రేక్షకుల్లా చూస్తున్న చిన్నడి యువకులు బంట్లను పట్టుకుని చావచితక గొట్టారు. ఇలా జరుగుతుందని ఊహించని జమీందారూ, అతని బంట్లూ బిత్తరపోయారు. జమీందారు యువకుల కేసి ఉరిమిచూశాడు.

"ఎందుకలా చూస్తావు? సత్రం పేరునా, శివాలయం పేరునా వాళ్లరక్తం చాలాకాలంగా పీల్చారు. ఇంతదాకా సహించారు, ఇక సహించమని తెలియ జేస్తున్నారు, అంతే!" అన్నాడు బావమరిది జమీందారుతో.

దానికి జమీందారు, "ఛీ, కుక్కా! నువ్వేం తక్కువ తిన్నావు? సత్రంలో దిగే ప్రయాణీకులనూ, వర్తకులనూ దోచుకుని, దొంగలు పడ్డారంటూ నువు పుకార్లు వెయ్యలేదా! సత్రం కట్టించే స్థలంలో ఉండిన వారిని లేపడానికి వాళ్ళ ఇళ్ళకు నిప్పు పెట్టింది నువు కాదా? ఇప్పుడు ఏమని ధర్మపన్నాలు చెబుతావు?" అని అడిగాడు.

"కిరాతకుడా, ఆ పనులన్నీ చేయిం చింది నువు కాదా? వెంటనే వెళ్ళు." అన్నాడు బావమరిది.

ఈ విధంగా పాత ఘోరాలు బయట పడుతూంటే యువకులు సహనం కోల్పోయి, రెచ్చిపోయారు. చిన్నడు వాళ్ళను వారించి, జమీందారుతోనూ, అతని బావమరిదితోనూ ఇలా అన్నాడు:

"నిజానికి మీ రిద్దరూ చీడపురుగులే. మీ నేరాలు మీ నోటనే బయట పెట్టు కున్నారు గనక ఈ గ్రామాన్ని వదిలి పొండి. ప్రజలు అమాయకులై కళ్ళు మూసుకున్నంతవరకే మీ ఆటలు! ఇప్పుడు వాళ్ళు కళ్ళు తెరిచారు. అందు చేత మీకు ప్రమాదం!"

జమీందారూ, అతని బావమరిదీ వాడి కేసి బిత్తరపోయి, "ఈ నాటకమంతా నువు ఆడించినదా?" అన్నట్టు చూశారు. వాళ్లు ఆ గ్రామం వదిలినదాకా అగి, చిన్నడు కూడా తన కుక్కతో సహా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.






శేషయ్య కొద్దికాలం క్రితం పెళ్లి చేసుకుని, ఉద్యోగం చేస్తున్నాడు. అతనికి గణపతి అనే పరిచయస్తుడు ఆ ఊళ్లో ఉన్నాడు. ఒకనాడు గణపతి తన భార్య గంగతో సహా వచ్చి, మర్నాడు తమ బాబు పుట్టిన రోజు పండగ విందుకు శేషయ్యనూ, అతడి భార్య కావేరినీ ఆహ్వానించారు. విందుకు ఉత్త చేతులలో వెళ్ళటం బాగుండదని శేషయ్యా, కావేరీ పిల్లవాడి కోసం బట్టలుకొని, మర్నాడు పట్టుకుపోయారు.

కావేరికి ఇటువంటి విందులూ, వినోదాలూ కొత్త. గణపతి ఇంటి అందమూ, సందడీ చూసి ఆమె ముచ్చట పడింది. గంగ మంచి పట్టుచీర కట్టుకుని, ఒంటి నిండా నగలు దిగవేసుకుని, హడావుడిగా అటూఇటూ తిరుగుతున్నది. వచ్చిన ప్రతి ఒకరూ ఏదో ఒక బహుమతి పిల్లవాడి చేతిలో పెడుతున్నారు. విందు ముగిసినాక, ఒక పక్కన గుట్టగా పోసి ఉన్న బహుమతులను చూడగానే కావేరి కళ్లు చెదిరిపోయాయి.

ఇంటికి వచ్చాక ఆమె తన భర్తతో, ''ఎంత సరదాగా ఉందో ఈ విందు తతంగం! గణపతి కన్న మనం ఏం తీసిపోయాం? త్వరలోనే మనమూ విందు ఏర్పాటు చేద్దాం,'' అన్నది.

శేషయ్య తన పెళ్ళాం ముచ్చటను కాదనలేదు.

వారం తిరగ కుండానే కావేరి గంగ ఇంటికి వెళ్ళి, ''రేపు నా పుట్టిన రోజు. విందు చెయ్యబోతున్నాను. మీరు తప్పక రావాలి,'' అని చెప్పి, ఆమెను వెంటబెట్టుకుని, ఆమె సహాయంతో చుట్టుపక్కల వున్న ఇళ్ళవాళ్ళ నందరినీ పిలిచి వచ్చింది.

మాచిరాజు కామేశ్వరరావు

విందు ఏర్పాట్లు పెద్ద ఎత్తున చేసింది కావేరి. ఆహ్వానితులు పాతిక మందికి పైగా కానుకలతో సహా వచ్చారు. వాళ్లు విందు ఏర్పాట్లను, అదేపనిగా మెచ్చు కున్నారు.

అది మొదలు గంగా, కావేరీలు పోటీ పడి విందులు చేయసాగారు. వంక దొరకకపోతే వాళ్లు సంవత్సరానికి మూడు నాలుగు పుట్టినరోజు పండుగలు కూడా చేసుకునే వారు.

సంవత్సరం గడిచేసరికి ఈ విందుల గోలతో గణపతి, శేషయ్యా కూడా ఢీలా పడిపోయారు. వాళ్ళిద్దరూ ఒకసారి బజారులో కలుసుకున్నప్పుడు, చాలాసేపు ఆ సంగతీ, యీ సంగతీ మాట్లాడుకుని, చివరకు నిర్మొహమాటంగా తమ భార్యలను గురించి ఒకరికొకరు చెప్పు కున్నారు.

''నా భార్యకు ఈ విందుల పిచ్చి ఎప్పుడు వదులుతుందోగాని, నా ప్రాణాలు తోడేస్తున్నదంటే, నమ్ము!'' అని వాపోయాడు గణపతి.

''నా భార్య ఏమీ తక్కువ తినలేదు. నీ భార్య పుణ్యమా అని, నా భార్యకు కూడా ఈ విందు పిచ్చి పట్టుకున్నది,'' అన్నాడు శేషయ్య.

''నీ భార్య కేవలమూ బహుమతుల కోసం ఈ విందుల తతంగం ఏర్పాటు చేస్తున్నదిట! నా భార్య చెప్పింది,'' అన్నాడు గణపతి.



"నా భార్య కూడా చెప్పిందిలే! నీ భార్య తన నగలు ప్రదర్శించు కునేందుకే విందులు చేస్తున్నదిట!" అన్నాడు శేషయ్య.

"నీ భార్య పిచ్చిని సులభంగా వదల గొట్టవచ్చు," అంటూ గణపతి శేషయ్యకు ఒక ఉపాయం చెప్పాడు.

"నీ భార్య పిచ్చిని ఇంకా సులభంగా వదలగొట్టవచ్చు." అంటూ శేషయ్య గణపతికి ఒక ఉపాయం చెప్పాడు.

ఒకనాడు, కావేరి ఏర్పాటు చేసిన విందుకు గంగ దుస్తులూ, నగలూ సిద్ధం చేసుకుంటూ, నగలపెట్టె తెరిచి, కెవ్వు మన్నది. అందులో ఒక్క నగ కూడా కనబడ లేదు.

ఆమె రాగాలు తీస్తూ ఖాళీపెట్టె గణపతి ముందు పెట్టి, "ఇందులో నగలన్నీ ఏమయాయి?" అని కోపంగా అడిగింది.

"ఇంకా ఎక్కడి నగలు? ఇన్నాళ్లు ఉన్నాయి, సంతోషించు! నువు నెలకు రెండుసార్లు చేసే విందులకూ, ఇతరుల విందులకు తీసుకుపోయే బహుమానాలకూ డబ్బు ఎక్కడి నుంచి వచ్చిందను కున్నావు? మా యజమాని దగ్గిర అప్పు చేశాను. అప్పు రెండువేలదాకా అయింది. తీర్చకపోతే వల్లకాదన్నాడు యజమాని. నగలు తాకట్టుపెట్టి, బాకీ తీర్చాను. తాహతుమించి డబ్బు తగలేస్తే ఇలాగే అవుతుంది. మనం రెండు, మూడేళ్ళు



పాడుపుచేస్తేనేగాని నగలు విడిపించుకోలేం,'' అన్నాడు నగలు దాచిపెట్టిన గణపతి.

నగలు పోయినందుకు గంగ సాయంత్రందాకా ఏడ్చింది. మరి విందుల జోలికి జన్మలో పోగూడదని ఆమె నిశ్చయించుకున్నది.

శేషయ్య ఆ రోజు, తన భార్యకు తెలియకుండా, పనిగట్టుకుని అందరి ఇళ్ళకూ వెళ్ళి, ''ప్రతి విందుకూ మీరు బహుమతులు తీసుకురావటం ఏమీ బాగు లేదు. బహుమతులు తెచ్చేటట్టుంటే అసలు విందుకే రావద్దు,'' అని అభిమానం నటిస్తూ అందరికీ చెప్పాడు. పీడ విరగడ అయిందని అందరూ సంతోషించారు.

విందుకు ఆహ్వానితులందరూ చేతులు ఊపుకుంటూ రావటం చూసి కావేరి ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది. వచ్చినవారంతా వంటకాలను మెచ్చుకుంటూంటే ఆమెకు మండుకొచ్చింది.

అందరూ వెళ్ళాక ఆమె శేషయ్యతో, ''ఒక్కరూ బహుమతి తెచ్చిన పాపాన పోలేదు. మర్యాద తెలీని మనుషులు! తేరగా తినిపోయారు,'' అన్నది.

''వెర్రిదానా, ఈ విందులన్నీ బహుమతుల కోసం చేస్తున్నామా? విందుల కయే ఖర్చుతో నువు కావలసినవి కొనుక్కోలేవూ? కరువు రోజుల్లో ఎందుకీ దండగ ఖర్చులు. మరో పది విందులు ఇలా చేశామంటే మనం దివాలా తీయటం ఖాయం!'' అని శేషయ్య తన భార్యను మెత్తగా చివాట్లు పెట్టాడు.

ఆ మాట నిజమేననిపించి, కావేరికి విందుల మీద రోత పుట్టింది. కూడబలుక్కున్నట్టుగా గంగా, కావేరీ విందులు మానేశారు.

తమ పథకాలు పారినందుకు శేషయ్యా, గణపతీ ఎంతగానో పొంగిపోయి, ఆ ఆనందంలో బ్రహ్మాండమైన విందు ఏర్పాటుచేసి, ఇకమీదట విందులకు స్వస్తి అన్నారు.



# మామకు తగ్గ కోడలు

రామాపురంలో వరదయ్యశెట్టి అనే వర్తకుడు పైసాకు పైసా కూడబెట్టి లక్షలు గడించాడు. అతడికి ఒక్కడే కొడుకు. వాడికి యుక్తవయసు వచ్చేసరికి, తనకు రాబోయే కోడలు పొదుపరి అయి, సంసారాన్ని గుట్టుగా నడిపేదిగా ఉంటుందో, ఉండదో అని దిగులు పట్టుకుంది శెట్టికి. తనకు కావలసిన లక్షణాలు గల పిల్ల కోసం ఆయన కొడుకును వెంట బెట్టుకుని ఊళ్ళ వెంట బయలుదేరాడు.

ఎన్నో సంబంధాలు చూశాడు శెట్టి. కలిగిన ఇంటిపిల్లల ఆడంబరం చూస్తే ఆయనకు దడ పట్టుకుంది. అలాటి పిల్లలను చేసుకుంటే ఎంతటి ఆస్తి అయినా ఇట్టే హారతి కర్పూరంలా ఇగిరిపోతుంది! ఎక్కడా సంబంధం కుదరక ఇంటికి తిరిగివస్తూ, దారిలో ఒక స్నేహితుడి ఇంట మజిలీ చేశాడు శెట్టి.

ఆ స్నేహితుడికి పెళ్ళీడు వచ్చిన కూతురున్నది. ఆమె మహా గడుగ్గాయి. ఆ పిల్ల తన కొడుకును ఎదురుగా కూర్చోబెట్టుకుని, ఏవో అడుగుతూ, లెక్కలు వేస్తూండటం గమనించి, అదేమిటని శెట్టి అడిగాడు.

"ఏం లేదండీ. మీరు మీ అబ్బాయి పెళ్ళి కోసం చాలా తిరిగి కొంత డబ్బు ఖర్చు చేశారు గదా? మీరు మా ఇంటికి వచ్చినందుకు మాకు ఖర్చు అవుతున్నది గదా? ఈ నష్టాలను ఎలా పూడ్చాలని మీ అబ్బాయితో ఆలోచిస్తున్నాను," అన్నదా పిల్ల.

శెట్టి వెంటనే ఆ పిల్లను తన కోడలుగా ఎన్నుకున్నాడు.

—తంజావూరు రాజేంద్రప్రసాద్.





# కొత్త అల్లుడి బాధ్యత

రంగరాజుది పెద్ద కుటుంబం. పదిమంది పిల్లలు. పెద్దవాళ్లు ఆరుగురూ ఆడపిల్లలే. అయితే రంగరాజు నూరెకరాల మాగాణీ భూమిగల సంపన్నుడు. అందుచేత అతని కుటుంబానికి వైభోగంగా జరిగిపోతున్నది.

పెద్ద కూతురికి పెళ్ళిచేశాక రంగరాజు దీర్ఘవ్యాధితో మంచాన పడ్డాడు. అందుచేత ఆయన తన పెద్ద అల్లుణ్ణి తన ఇంటనే ఉండి, ఇంటి బాధ్యత వహించమని కోరాడు. పెద్ద అల్లుడు రాజయ్యకు పెద్ద దివాణానికి పెత్తనం దొరికింది గదా అని ఒప్పుకున్నాడు. అతను మంచి వ్యవహార దక్షతగల వాడనటానికి సందేహం లేదు. మామగారి వ్యవహారాలు ఆకళింపు చేసుకోవడానికి అతనికి ఎంతో కాలం పట్టలేదు. రంగరాజు పొలాలనూ, పశువులనూ చూసే నౌకర్లు ముప్ఫైమంది దాకా ఉన్నారు.

రాజయ్య గాదె కింది పందికొక్కులా మామగారి ద్రవ్యాన్ని తాను వీలయినంత వెనక వేసుకోసాగాడు. అందుకోసం మామగారి కుటుంబం పొదుపు అవలంబించేలాగా చేశాడు. ఏడాదికి మూడుసార్లే కొత్త బట్టలు! వారానికి ఒకసారే పిండి వంటలు!

అతను తన మరదళ్ళు నలుగురికీ పెళ్ళిళ్లు చేసేటప్పుడు తన తోడల్లుళ్ళు తన చెప్పుచేతలలో ఉండే వాళ్లుగా చూసి మరీ చేశాడు. అతని వ్యవహారాలలో జోక్యం కలగజేసుకోకుండా ఉంటే అతను తమకు సుఖంగా జరుగుబాటు అయేలాగా చూస్తాడని వాళ్ళు గ్రహించి, అతని పెత్తనం నిరాఘాటంగా సాగనిచ్చారు.

ఇలా ఉండగా రంగరాజు ఆరో కూతురి పెళ్ళి రాజయ్య ఇష్టప్రకారం జరగలేదు. ఆ పిల్ల వీరరాజు అనే యువకుణ్ణి

ప్రేమించి, అతన్ని తప్ప పెళ్లాడనన్నది. ఆ ఇద్దరికీ పెళ్ళి అయింది. దానితో రాజయ్యకు చిక్కులు ఆరంభమయాయి.

వీరరాజు వయసుకు చిన్నవాడైనా మంచి తెలివితేటలు గలవాడు. అతను రాజయ్య ప్రతి చర్యనూ ఒక కంట కనిపెడుతూ, ప్రతి చర్యకూ ఎక్కదీసి ప్రశ్నించసాగాడు.

ఇందువల్ల రాజయ్య పెత్తనానికి అడుగడుగునా ప్రతిబంధకాలేర్పడ్డాయి. ప్రమాదాన్ని గ్రహించి, అతను తన మామగారితో, "చూస్తున్నారు గదా? ఇటీవల మనకు డబ్బు ఇబ్బంది ఎక్కువగా ఉంటున్నది. కారణం మరేమీ లేదు. ఇంటా, బయటా కూడా క్రమశిక్షణ తగ్గిపోయింది. నేను ఇంటికి అల్లుణ్ణేగాని, ఆస్తికి వారసుణ్ణి కాను గదా! అందుకని నా మాట ఎవ్వరూ వినడంలేదు," అన్నాడు.

ఈ మాటకు రంగరాజు నొచ్చుకుని, "అయితే ఏం చెయ్యాలి?" అని అడిగాడు.

"మీకు నా మీద నమ్మకం ఉంటే, మీ పెద్ద అబ్బాయికి కాస్త వ్యవహార జ్ఞానం అబ్బేదాకా, ఆస్తిని కాపాడడానికి సర్వహక్కులూ నాకిచ్చినట్టు ప్రకటించండి," అన్నాడు రాజయ్య.



ఆ ప్రకారమే రంగరాజు ఇంటిల్లిపాదినీ, పనివాళ్ళనూ పిలిచి, రాజయ్య ఏం చెప్పినా అది తాను చెప్పినట్టేననీ, అతని మీద ఎవరు ఫిర్యాదు చేసినా తాను వినబోవడం లేదనీ చెప్పేశాడు.

ఇంక రాజయ్య విజృంభించి మామగారి సొత్తును మరింత చురుకుగా కొల్లగొట్టసాగాడు. అందరికన్న ఎక్కువ ప్రతిబంధకంగా ఉన్న వీరరాజు మీద దొంగతనం ఆరోపణ చేసి, న్యాయాధికార్లకు అప్పగించి, నిర్బంధంలో పెట్టించాడు. వ్యవహారం ఇలా ముదిరినాక రంగరాజు ఆక్షేపణ తెలిపితే, ఆయనకు మతి చలించిందని రాజయ్య ప్రచారం చేశాడు.

అతనికి ఇక అడ్డులేదు. అతను తన సొంత ఊళ్లో బహిరంగంగానే పెద్ద మేడ కట్టించనారంభించాడు.

అయితే వీరరాజు మీది దొంగతనం ఆరోపణ నిలవలేదు. అతన్ని అధికారులు నిర్బంధం నుంచి విడిచిపెట్టారు. అతను పరిస్థితులన్నీ తెలుసుకుని న్యాయాధికారితో రాజయ్య దుర్మార్గాలన్నీ చెప్పి, తన మామగారికి పిచ్చి ఎత్తిందని గదిలో బంధించి ఉంచాడనీ, వైద్యులచేత పరీక్ష చేయించమనీ కోరాడు. వైద్యులు రంగరాజును పరీక్షించి ఆయనకు ఎలాటి పిచ్చీ లేదని చెప్పారు.

రంగరాజు తన పెద్ద అల్లుడికి లోగడ ఇచ్చిన పెత్తనం రద్దుచేసి, దాన్ని వీరరాజుకు అప్పగించాడు.

కొన్ని నెలలు గడిచాయి. రాజయ్య అసలు స్వరూపం బయట పెట్టటం తప్ప వీరరాజు మరేమీ సాధించలేదు.

పనివాళ్ళలో చురుకులేదు. రాజయ్య కొందరు పనివాళ్ళను కూడగట్టుకునేటందుకు వారికి సోమరితనం మప్పాడు. దానివల్ల ఇతరులకు కూడా పనిలో శ్రద్ధ పోయింది. తమ శ్రమ ఫలితం గురించి వాళ్ళు గర్వించటం మానేశారు. పశు సంపద కూడా అస్తవ్యస్తంగా ఉన్నది. వీరరాజు ఈ పరిస్థితిని కొంచెం కూడా మార్చలేకపోయాడు.

అతను తన అశక్తతను గురించి ఒకసారి రంగరాజుతో మాట్లాడాడు. రంగరాజు నవ్వి, "రాజయ్య దుర్మార్గుడైనంతమాత్రాన సమర్థుడు కాకపోలేదు. అతని స్వార్థం అతని సామర్థ్యాన్ని దెబ్బతీసింది. అతని తప్పులు ఎంచడం మానేసి, ఖర్చుకు తగ్గట్టుగా ఆదాయాన్ని పెంచే మార్గం చూడు. కొత్త అల్లుడివైన నీ బాధ్యత అదే," అన్నాడు.

దానితో వీరరాజు రాజయ్య విషయం మరిచిపోయి, రంగరాజు ఆస్తిని సక్రమమైన మార్గంలో పెట్టి, రెండేళ్ళలో పూర్వపు ఐశ్వర్యాన్నీ, వైభోగాన్నీ తిరిగి నెలకొల్పాడు.






వరహాలశెట్టి పేరు మోసిన వర్తకుడు. ఆవాలు దగ్గిరనుంచీ ఆణిముత్యాల వరకూ భారీఎత్తున వ్యాపారంచేసి, లక్షలు కూడ బెట్టాడు. కోటికి పడగఎత్తాలని అతని ఆశ.

ఆ కాలంలో దేశపరిస్థితి ఘోరంగా ఉన్నది. తాగుడూ, జూదమూ మొదలైనవి విచ్చలవిడిగా సాగుతున్నాయి. ప్రభుత్వ నాణాలకు నకిలీనాణాలు తయారవు తున్నట్టు వదంతి వ్యాపించింది. అసలు నాణాలు తీసుకుని రెట్టింపు నకిలీ నాణా లిచ్చే వాళ్ళు ఉన్నారని వరహాలశెట్టి విని ఉన్నాడు. అలాటి అవకాశం దొరికితే తన వద్ద ఉన్న లక్షలను రెండింతలు చేసుకోవచ్చు! అందుకని శెటి నకిలీ నాణాల వర్తకులను గురించి దర్యాప్తు చేస్తూవచ్చాడు.

ఒకనాడు అతను అంగడి వీధిలో వెళుతూండగా, ఎవరో బిచ్చగాడికి ఒక పెద్దమనిషి తన జేబులో నుంచి గుప్పెడు వెండి నాణాలు ఇయ్యడం కనబడింది. అది చూసి శెట్టి గుండె గుబగుబలాడింది. బిచ్చగాణ్ణి పోనిచ్చి వరహాలశెట్టి ఆ పెద్ద మనిషిని సమీపించి, అతనికి తన పేరు చెప్పుకుని, అతని పేరు వర్ధమాను డని తెలుసుకున్నాడు.

"మీరు గుప్పెళ్ళతో నాణాలు దానం చేస్తారా?" అని అడిగాడు శెట్టి.

"మీరు అడగండి. మీ స్థాయినిబట్టి బుట్టెడు నాణాలు ఇస్తాను," అన్నాడు వర్ధ మానుడు, స్నేహపూర్వకంగా నవ్వుతూ.

"ఎలా ఇయ్యగలుగుతారు?" అని శెట్టి అడిగాడు.

"అవన్నీ నిజమైన నాణాలైతే గద! తక్కువరకం లోహనికి వెండి పూత పూసినవి. ఎవరెన్ని మార్చగలిగితే అన్ని ఇయ్యగలను. వాటికీ, ఖజానా నాణాలకూ

ఎం. వి. వి. సత్యనారాయణ



తేడా ఎవరూ కనిపెట్టలేరు,'' అంటూ వర్ధమానుడు గుప్పెడు నాణాలను వరహాలశెట్టికి ఇచ్చి, ''కావాలంటే మీరు మార్చండి. నేను మీ కూడా ఉంటాను,'' అన్నాడు.

వరహాలశెట్టి బెదురుగా ఆ నాణాలను అందుకుని, అతడితోబాటు బట్టలకొట్టుకు వెళ్ళి, ఆ డబ్బుతో బట్టలు కొన్నాడు. ఆ నాణాలు అతిసులువుగా చలామణీ కావటం చూసిన మీదట, ఆ నాణాలను మార్చడం వరహాలశెట్టికి చాలా తేలికే ననిపించింది.

బట్టల దుకాణం నుంచి బయటికి వచ్చాక వర్ధమానుడు శెట్టి భుజం తట్టి, 'ధైర్యం చిక్కిందనుకుంటాను. ఇంకా ఇస్తాను మార్చగలరా?'' అని అడిగాడు.

శెట్టి తల ఆడించాడు. అతను వంద మంచి నాణాలిచ్చి, రెండు వందలు మాయనాణాలు పుచ్చుకునేటట్టు ఏర్పాటయింది.

శెట్టి డబ్బు తీసుకుని వర్ధమానుడి ఇంటికి వెళ్ళాడు. వర్ధమానుడు శెట్టి యిచ్చిన నాణాలను నిర్లక్ష్యంగా ఒక బుట్టలోకి విసిరి, మంచం కింద నుంచి ఒక పెట్టె లాగి, రెండు గుప్పిళ్ళతో నాణాలు తీసుకుని శెట్టికిస్తూ, ''ఎంచండి. నాలుగు హెచ్చే ఉంటాయి,'' అన్నాడు.

శెట్టి లెక్కపెట్టి చూస్తే, ఇరవైనాణాలు హెచ్చుగానే ఉన్నాయి. ఆ నాణాలను తన వ్యాపారంలో పెట్టి, చెల్లించటానికి ఏమీ శ్రమ అనిపించలేదు. దొంగనాణా లతో అతని వ్యాపారం పెరగసాగింది.

శెట్టి తన వద్ద ఉన్న పదిలక్షల నాణాలను బస్తాలకెత్తి బండి మీద వేసుకుని వర్ధమానుడి ఇంటికి వెళ్ళాడు.

''ఇంతడబ్బు నా చేతి మీదుగా మార్చటం బాగుండదు. మా గురువుగారా పని చేస్తారు. ఆయన వద్దకు పోదాం,'' అన్నాడు వర్ధమానుడు.

నాణాల బస్తాలను రెండెడ్ల బండి మీద వేసుకుని, ఇద్దరూ బయలుదేరి, రెండు

రోజులు ప్రయాణం చేసి, గురువుగారి ఊరు చేరారు. అక్కడ చాలా సులువుగా పనిముగిసింది.

వరహాలశెట్టి రెట్టింపు నాణాల బస్తాలతో రెండు బళ్ళుకట్టుకుని వర్ధమాను డిచ్చిన నలుగురు మనుషులను తోడు తీసుకుని తిరుగుప్రయాణమైనాడు. వర్ధమానుడు మాత్రం పని ఉండి గురువుగారి దగ్గిరే దిగబడిపోయాడు.

రెండోనాటి ప్రయాణంలో, దూరం నుంచి రాజభటులు వస్తున్నట్టు సేవకులు గమనించి శెట్టితో, ''రాజభటులు వస్తున్నారు. ఎందుకైనా మంచిది, మనం బళ్లు ఒక పక్కగా ఆపి, అవి మనవికానట్టు నటించుదాం. వాళ్ళు మనను దాటి పోయాక తిరిగి ప్రయాణం సాగించుదాం," అన్నారు.

అసలే భయపడుతున్న శెట్టి వాళ్లు చెప్పినట్టే చెయ్యనిచ్చాడు. రాజభటులు వచ్చి బళ్ళ మీది నాణాల బస్తాలను తడివి చూసి, ''ఇవి ఎవరివి?" అని వరహాలశెట్టినీ, సేవకులనూ అడిగారు.

''మా కేం తెలును? కూలిపని కోసం పొలాలు పట్టి తిరుగుతూ ఉంటే, ఈ మహారాజుగారు తమ పొలం దున్నటానికి పిలుచుకుపోతున్నారు,'' అన్నారు సేవకులు.

వరహాలశెట్టి తలాడించాడు. రాజభటులు బళ్ళు తోలుకుని, రాజధాని కేసి వెళ్లిపోయారు.



వరహాలశెట్టి కుంగిపోయాడు. అతను ఇంటికి వెళ్లి, నెలరోజులు మంచం పట్టాడు. అతనికి ఉన్నదంతా పోయింది. నెల్లాళ్ళ తరవాత కృశించి శెట్టి వీధిలోకి వచ్చాడు. అతనికి వర్ధమానుడు అంత దూరాన వీధిన నడిచిపోతూ కనిపించాడు. తాను చెడిపోయాడుగాని వర్ధమానుడు చెడిపోలేదు.

ఎవరో బిచ్చగాడు కుంటుకుంటూ వచ్చి వర్ధమానుణ్ణి ధర్మం అడిగాడు. వర్ధమానుడు వాడికి గుప్పెడు నాణాలిచ్చి పంపేశాడు. బిచ్చగాడు కొంతదూరం కుంటుతూ వెళ్లి, తరవాత మామూలుగా నడిచిపోయాడు.

శెట్టి బిచ్చగాణ్ణి గుర్తుపట్టాడు. తాను చూస్తూండగా ఆ నాడు వర్ధమానుడి వద్ద నాణాలు పుచ్చుకున్న బిచ్చగాడు వీడే. వాడు వర్ధమానుడి మనిషే! తనను పట్టటానికి వాడు ఎర అన్నమాట.

వర్ధమానుడు బిచ్చగాడిని అనుసరించి వెళ్లి, వాణ్ణి అందుకుని, తాను వాడికిచ్చిన డబ్బు తీసేసుకున్నాడు. వర్ధమానుడు వెళ్లిపోయాక వరహాలశెట్టి ఆ బిచ్చగాణ్ణి కలుసుకుని, తన వెంట వచ్చిన నలుగురు సేవకులలో వాడు ఒకడని తెలుసుకుని ఆశ్చర్యపోయాడు. రాజభటులు కూడా వాళ్ళ మనుషులే నన్నమాట!

''బిచ్చగాడు'' శెట్టితో, ''ఈ విషయం ఎక్కడ తెలిసినా మీ పరువు పోతుంది. మేం ఎటూ అన్నింటికీ తెగించిన వాళ్ళం,'' అన్నాడు.

''నా మాట ఏమిటి? నా బిడ్డల గతి ఏం కాను?'' అన్నాడు శెట్టి.

''కొంత డబ్బు అప్పు ఇస్తాను. ఏదన్నా చిన్న వ్యాపారం చేసుకోండి,'' అన్నాడు ''బిచ్చగాడు''.

''అసలు నాణాలా? దొంగనాణాలా?'' అని శెట్టి అనుమానంగా అడిగాడు.

ఆ మనిషి నవ్వి, ''అసలూ, నకిలీ అన్న ప్రసక్తి లేదండీ. అన్నీ అసలు నాణాలే,'' అన్నాడు.



# ధాన్యం విలువ

ఒక ఊళ్ళో రాజయ్య అనే భూస్వామి ఉండేవాడు. ఆయన గొప్ప ఆస్తిపరుడేగాక, మహా పట్టణాలలో మాత్రమే ఉండే గొప్ప మేడ కట్టించాడు. దాన్ని చూడటానికి చుట్టుపక్కల గ్రామాలవాళ్ళు వస్తూండేవాళ్ళు.

ఆయన తన పొలాలలో పండిన ధాన్యాన్ని ఒక కొట్టులో పోసి, తన పనివాళ్ళకూ, బీద సాదలకూ తానే స్వయంగా ధాన్యం కొలిచి ఇచ్చి, కొట్టుకు భద్రంగా తాళం వేసేవాడు.

ఒకనాడు పక్క గ్రామం నుంచి ముగ్గురు మనుషులు రాజయ్య మేడ చూడవచ్చారు. అప్పుడు రాజయ్య తన కూలీలకూ, పేదలకూ ధాన్యం కొలవటం పూర్తిచేసి, కిందపడిన గింజలను భద్రంగా ఏరి ధాన్యపు కొట్టులో వేస్తున్నాడు. అది చూసి ముగ్గురిలో ఒకడు, "ధాన్యపు గింజలను బంగారంగా ఏరుతున్నారే!" అని వెటకారంగా అన్నాడు.

ఆ ముగ్గురినీ తన ఇంట భోజనానికి ఉండమని రాజయ్య వాళ్ళ కోసం రకరకాల పిండివంటలు చేయించాడు. వాటి వాసనకే వాళ్ళకు నోరూరింది. తరవాత రాజయ్య వాళ్ళను భోజనానికి తీసుకుపోయాడు. వాళ్ళ ముందు విస్తళ్ళలో వంటావిడ బంగారం ముద్దలు వడ్డించింది.

"ధాన్యం కన్న విలువైన ఈ బంగారాన్ని ఆరగించండి," అని రాజయ్య వారిని వేడుకున్నాడు. వాళ్ళు వెంటనే తమ తప్పుతెలుసుకుని, క్షమాపణ చెప్పుకుని, రాజయ్య పెట్టిన విందుభోజనం తిని, వెళ్ళిపోయారు. —టి. శ్రీమన్ భవాని బి. కాం.





# నేరానికి తగిన శిక్ష

కాశీపట్టణంలో ఒకప్పుడు కమలశ్రేష్ఠి అనే ధనికవర్తకుడికి పద్మిని అనే చక్కని కుమార్తె ఉండేది. ఆమెకు మంచి గుణాలున్నట్టు పేరు ఉండేది. ఆమె కోసం వెదకి, వెదకి ఆమె తండ్రి చంద్రుడనేవాణ్ణి తెచ్చి, వైభవంగా పెళ్ళిచేసి, అతన్ని ఇంట ఉంచుకుని, క్రమంగా తన వర్తకమంతా అల్లుడికి అప్పజెప్పాడు.

పద్మినికి మాత్రం చంద్రుడంటే ఇష్టం లేదు. పైకి మహా గుణవతిగానూ, పతివ్రతగానూ నటిస్తూ, చాటుగా యథేచ్ఛగా సంచరించసాగింది. కొంత కాలానికి ఆమెకు ఒక కొడుకు కలిగాడు. ఆమె వాణ్ణి తాక నిరాకరించి, "కొడుకైనా పరపురుషుడే గదా!" అన్నది.

"అమ్మో, ఎంత పతివ్రత!" అని అందరూ అనుకున్నారు.

ఒకనాడు చంద్రుడు తన దుకాణంలో ఉండగా దారి వెంట పవిత్రోదకం చల్లుకుంటూ పోతున్న ఒక బ్రాహ్మణ యువకుడు కనిపించాడు. అతను చాలా అందంగానూ, స్ఫురద్రూపిగానూ ఉన్నాడు. చూసేవాళ్ళకు అతను మహా ఉత్తముడనీ, పవిత్రుడనీ భావం కలిగింది.

ఆ సమయాన చంద్రుడు ఎవరికో గోధుమలు కొలుస్తున్నాడు. ఆ గోధుమలలో నుంచి ఒక ఎండు పరక గాలికి లేచి, ఆ బ్రాహ్మణ యువకుడి పిలక మీద వాలింది. చంద్రుడు నొచ్చుకుని దాన్ని తీయబోయాడు.

కాని ఆ బ్రాహ్మణ యువకుడు అతన్ని వారిస్తూ, "ఆగు! నేను నా శిరస్సును ఖండించుకుంటాను. నేను ఇంతవరకూ ఎలాటి పాపమూ చెయ్యలేదు. ఇప్పుడు

"సాహితీప్రియ"

నా పట్ల పాపం జరిగింది. నా శిరస్సును ఖండించుకోవలసిందే!'' అన్నాడు.

చంద్రుడు ఎంతో చెప్పిన మీదట యువకుడు ఆ ఆలోచన కట్టిపెట్టాడు. చంద్రుడికి ఆ యువకుడి మీద ఎంతో భక్తి, గౌరవమూ కలిగాయి. అతను ఆ యువకుణ్ణి కొంతకాలం తమ ఇంట ఉండి తమను పావనం చెయ్యమని కోరాడు. బ్రాహ్మణ యువకుడు అందుకు సమ్మతించాడు.

ఒకసారి చంద్రుడికి ఒక ఆలోచన వచ్చింది. తనలో జవసత్వాలు ఉన్నప్పుడే భారీ ఎత్తున వ్యాపారం చేసి, సంపాదించే దంతా సంపాదించాలని అతను అనుకుని, తన ఇంటి భారమంతా బ్రాహ్మణ యువకుడి పైన ఉంచి, వ్యాపార సరకులతో సహా, మజిలీలు చేసుకుంటూ, పాటలీపుత్రానికి బయలుదేరాడు.

అతను ఆఖరు మజిలీ పాటలీపుత్రం సమీపంలోని ఒక వనంలో చేశాడు. అక్కడ ఒక చెట్టు మీద ఒక పక్షి ఏమాత్రమూ కదలకుండా, బొమ్మలాగా కూర్చుని ఉన్నది. ఇతర పక్షులు ఆహారం కోసం చెట్టుమీది నుంచి ఎగిరి పోగానే, ఇతర పక్షుల గూళ్లలోని గుడ్లను భక్షించి, మళ్ళీ చెట్టు కొమ్మ మీద నిశ్చలంగా కూర్చున్నది.

''ఆహా, ఇది ఎంత పచ్చి దుర్మార్గపు పక్షి! దీనికి శిక్షలేదా?'' అనుకున్నాడు చంద్రుడు.



అంతలోనే ఒక బోయవాడు బాణం వేసి, ఆ పక్షిని పడగొట్టాడు. ఇది చూసి చంద్రుడు మనస్సు వికలమై, కొంచెం దూరంలో కనిపించిన ఆశ్రమం కేసి వెళ్ళాడు. అక్కడ ఒక మునీశ్వరుడు ధ్యానంలో ఉన్నాడు.

ఒక స్త్రీ చాలా ఆభరణాలు ధరించి వచ్చి, మునీశ్వరుడి ముందు సాష్టాంగ పడింది. మునీశ్వరుడు చప్పున ఆమెను కత్తితో వెన్నులో పొడిచి చంపి, ఆమె నగలన్నీ తీసి మూటగట్టి దాచాడు. ఇదంతా చంద్రుడు దూరం నుంచి చూసిన సంగతి ఆ ముని గమనించ లేదు.

ఇది చూసిన మీదట చంద్రుడి అశాంతి మరింత అయింది.

ఇంతలో రాజభటులువచ్చి, ఆ మునినీ అతను హత్యచేసిన స్త్రీ శవాన్నీ స్వాధీన పరచుకున్నారు. ప్రపంచంలో ధర్మం ఉన్నదనుకున్నాడు చంద్రుడు. అతని అశాంతి తగ్గిపోయింది. మహాపతివ్రత అయిన తన భార్యా, మహాపురుషుడైన బ్రాహ్మణ యువకుడూలాటి వాళ్ళు ప్రపంచంలో ఉండబట్టే ధర్మం నిలిచి ఉన్నదని అతను అనుకున్నాడు.

అతను పాటలీపుత్రంలో తన వర్తకం సాధ్యమైనంత త్వరగా ముగించి, ఇంటి మీద ధ్యాసమళ్ళటం చేత, దారిలో మకాములూ, మజిలీలూ చెయ్యకుండా ప్రయాణం చేసి, అర్ధరాత్రివేళకు ఇల్లు చేరాడు. అతను తన గది కిటికీలో నుంచి లోపలికి చూసేసరికి, తన భార్యా, తను ఎంతో శీలవంతుడని నమ్మిన బ్రాహ్మణ యువకుడూ కనిపించారు.

"భగవంతుడా! ఏమిటీ అన్యాయం!" అని అతని ప్రాణం కొట్టుకుపోయింది.

అంతలో పై నుంచి నిద్రపోతున్న వాళ్ళ మీద నాగుపాము పడి, వాళ్ళు విదిలించేసరికి ఇద్దరినీ కరిచి ఎటో పోయింది. ఆ ఇద్దరూ నిద్రమత్తులోనే చచ్చిపోయారు.

"నేరాలను ధర్మం ఇలా శిక్షిస్తుంది కాబోలు!" అనుకున్నాడు చంద్రుడు.





# డబ్బుకన్న గొప్పది

ఒక నగరంలో జయశేఖరుడనే గొప్ప ధనికుడుండేవాడు. అతని భార్య పేరు జయప్రద. వారికి చాలా కాలం పిల్లలు కలగలేదు. పిల్లల కోసం చేయవలసిన పూజలూ, నోములూ అన్నీ అయాక ఆ దంపతులు సపరివారంగా తీర్థయాత్రలకు బయలుదేరారు.

వాళ్ళు తీర్థయాత్రలు ముగించుకుని తిరిగి వస్తూండగా, వారి దేశం సరిహద్దులో ఉన్న అరణ్యంలో ఒక పెద్ద దొంగల ముఠా వారిని చుట్టుముట్టింది. జయశేఖరుడి వెంట ఉన్నవాళ్ళు దొంగలను చూసి పారిపోయారు. దొంగలు జయశేఖరుణ్ణీ, అతని భార్యనూ నిలువుదోపిడీ చేసేశారు.

అదే సమయంలో దొంగలలో కొందరు జయప్రద అందచందాలు చూసి, ఆమెను బలాత్కరించ యత్నించారు. అది చూసి దొంగల నాయకుడు వారిని మందలిస్తూ, "ఆడవాళ్ళ జోలికి పోవద్దని మీకు ఎన్నిసార్లు చెప్పాను? మనకాకవలసింది డబ్బు. దానికోసమేగదా, మనం అన్నిటికీ తెగించి, యీ అరణ్యంలో తిరుగుతూ, దార్లు కొడుతున్నది. ఆ దొరికే డబ్బుతో తృప్తిపడి ఊరుకోండి. మరొకసారి ఇలా చేశారంటే, మీ తలలు తీసేస్తాను," అన్నాడు.

ఆ విధంగా మానం దక్కిన జయప్రద దొంగల నాయకుడితో, "అన్నా, మా దగ్గిర ఉన్నదంతా నువు దోచుకున్నప్పటికీ నీ రుణం తీరలేదు. ఆ రుణం ఏనాటికైనా తప్పక తీర్చుకుంటాను," అన్నది.

తరవాత జయశేఖరుడూ, జయప్రదా ఎన్నో ప్రయాసలకోర్చి, నగరంలోని తమ ఇంటికి తిరిగివచ్చారు.

వై. యస్. రాజేశ్వరి

కొంతకాలం గడిచింది. దొంగల నాయకుడు ఏదో పనిమీద నగరానికి వచ్చాడు. అతన్ని పట్టి, రాజుగారి నుంచి బహుమానం పొందటానికి చాలాకాలంగా ఎదురు చూస్తున్న రాజభటులు ఈ సారి అతన్ని గుర్తించి, పట్టుకునేందుకు వెంట పడ్డారు.

దొంగల నాయకుడు పారిపోయి ఒక భవంతిలో దూరి, భటులకు తన జాడ తెలియకుండా నేర్పుగా తప్పించుకున్నాడు. అయితే ఆ ఇల్లు జయశేఖరుడిది. జయశేఖరుడు దొంగల నాయకుణ్ణి గుర్తుపట్టాడు. ఒకనాడు ఆ దొంగ తన ముఠాతో వచ్చి జయశేఖరుడి సొమ్మంతా కొల్లగొట్టాడు. ఆ కసి మనసులో ఉంచుకుని జయశేఖరుడు, దొంగల నాయకుణ్ణి దాచే మిషమీద ఒక చీకటి గదిలోకి పంపి, బయట గడియపెట్టి, తాను దొంగను పట్టుకున్నట్టు రాజుగారితో చెప్పటానికి, దివాణానికి బయలుదేరాడు.

రాజుగారిచ్చే బహుమానం ద్వారా తన ధననష్టం కొంత అయినా పూడుతుందని జయశేఖరుడి ఆశ.

జయప్రద కూడా దొంగను గుర్తుపట్టింది. అయినా ఏమీ ఎరగనట్టు పూరుకున్నది. తరవాత తన భర్త అలా వీధిలోకి వెళ్ళగానే జయప్రద దొంగను చీకటి గదిలోనుంచి విడిపించి, "అన్నా, ఒకనాడు నువు నా మానం కాపాడావు. ఇవాళ నేను నీ ప్రాణం కాపాడి నా రుణం తీర్చుకున్నాను. వెళ్లు, బాబూ. కాస్త జాగ్రత్తగా ఉండు," అన్నది.

దొంగ కళ్ళనీళ్ళు పెట్టుకుని, ఎంతో కృతజ్ఞతా పూర్వకంగా ఆమె కాళ్ళకు నమస్కరించి, వెళ్లిపోయాడు. డబ్బుకన్న విలువైనవి జీవితంలో నిజాయితీ, కృతజ్ఞతాలాటివి చాలా ఉన్నాయని అతడు గ్రహించాడు.

ఆ నాటినుంచీ అతడు దొంగతనాలు చేయటం మానేసి, కష్టించి బతికే పద్ధతి అవలంబించాడు.





# వీరహనుమాన్

రాముడు రాజ్యం చేస్తూండగా ఉత్తర దిక్కున గంధర్వులు విజృంభించి ప్రజలను బాధించసాగారు. భరతుడు సేనలతో వెళ్ళి గొప్ప యుద్ధంచేసి వారిని అణచివేశాడు. గంధర్వుల దుండగాల నుంచి ప్రజలు బయటపడి సుఖించారు. అటు పిమ్మట వాయువ్య దిక్కున లవణాసురుడు అనే రాక్షసుడు ప్రళయం లాగ విజృంభించాడు. రాముడు శతృఘ్నుడికి దివ్యాస్త్రాలను ఇచ్చి లవణుడిని సంహరించి రమ్మని చెప్పాడు. శతృఘ్నుడికి తోడుగా రాక్షసమాయలకు ప్రతిక్రియలు చెప్పగల విభీషణుడు కూడా ఉంటే మంచిదని, లంకకు హనుమంతుడిచేత కబురు పంపించాడు. లంక నుంచి విభీషణుడు రాక్షసవీరులను వెంటబెట్టుకొని వచ్చాడు. శత్రుఘ్నుడు తన సేనలతో రాక్షసులను కూడ కలుపుకొని, విభీషణుడితో కలిసి, లవణాసురుడి పైకి యుద్ధానికి వెళ్లాడు.

శతృఘ్నుడు సుదర్శన చక్రాయుధం లాగ విజృంభించి లవణాసురుడి సేనలను చీల్చి చెండాడాడు. అప్పుడు జరిగిన ఘోర సంగ్రామంలో, విభీషణుడి రాక్షస సేన కూడా గొప్ప పరాక్రమం చూపింది. శతృఘ్నుడు లవణాసురుడితో యుద్ధంచేసి వాణ్ణి సంహరించాడు. విజయం సాధించి శత్రుఘ్నుడూ, విభీషణుడూ సేనలతో అయోధ్యకు తిరిగి వచ్చారు.

**40. శతకంఠరావణ సంహారం**



ఒకనాడు రాముడు తన కొలువు కూటానికి వచ్చి, సింహాసనం మీద కూర్చున్నాడు. ఎడమపక్క సీత కూర్చున్నది. రాముడికి ముందు హనుమంతుడు కూర్చున్నాడు. భరత, లక్ష్మణ, శత్రుఘ్న, సుగ్రీవ, అంగద, నల, నీల, జాంబవంత, విభీషణాదులూ; వసిష్ఠ, వాసుదేవాదులూ సభను అలంకరించి ఉన్నారు.

ఆ సమయంలో ఆ సభకు అగస్త్య మహాముని వచ్చాడు. రాముడు ఆయనకు చేతులెత్తి నమస్కారం చేసి, అతిథి సత్కారాలు జరిపి, క్షేమ సమాచారాలు అడిగాడు.

దానికి అగస్త్యుడు, "దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేసేవాడివి నువు ఉండగా మాకు క్షేమం కాకేమి, రామా? నువు దశకంఠుడైన రావణుణ్ణి చంపి గొప్ప కీర్తి సంపాదించావు నిజమేగాని, తిక్త సముద్రం అవతల మాయానగరం రాజధానిగా చేసుకుని శతకంఠుడనే రాక్షసుడు నిన్ను జయించాలనే ఉద్దేశంతో ఉన్నాడు," అన్నాడు.

రాముడు అమితాశ్చర్యంతో, వాడి కథ చెప్పమని అగస్త్యుణ్ణి అడిగాడు. అగస్త్యుడు ఇలా చెప్పాడు:

"కశ్యపుడికి వసువు అనే భార్య ఉండేది. ఆమె అసుర సంధ్యవేళ గర్భవతి అయి, మహా వికృతమైన ఆకారం గల శతకంఠుణ్ణి కన్నది. వాడు బ్రహ్మదేవుణ్ణి గురించి దారుణమైన తపస్సు చేశాడు. బ్రహ్మ సంతోషించి, శతకంఠుడికి ప్రత్యక్షమై, దేవేంద్రుడు మొదలైన దేవతలకు అసాధ్యమైన వరాలు ఇచ్చేశాడు. దానితో వాడు విజృంభించి, మూడు లోకాలనూ జయించే ఆలోచనలో ఉన్నాడు. రామా, నువు వాణ్ణి యుద్ధంలో చంపాలి."

రాముడు కొంచెం ఆలోచించి, "వాడు చూడటానికి ఎలా ఉంటాడు?" అని అగస్త్యుణ్ణి అడిగాడు.

"వాడు ఎలా ఉంటే మాత్రం నీ బాణాలకు అసాధ్యమేమిటి? రావణుడికి పదిరెట్లు ప్రతాపము, భీకర కంఠస్వరమూ గలవాడు. వాణ్ణి ఎలా చంపాలో నీకు ఒకరు చెప్పాలా?" అన్నాడు అగస్త్యుడు.

అగస్త్యుడు వెళ్ళిపోయాక రాముడు తన తమ్ములతో, "యుద్ధంలో రావణ, కుంభకర్ణాది రాక్షసులను చంపి అలిసి ఉన్నాను. లక్ష్మణుడు కూడా నాతోపాటు శ్రమపడినవాడే. భరతుడు గంధర్వులతోనూ, శత్రుఘ్నుడు లవణాసురుడితోనూ యుద్ధం చేసి అలిసిపోయి ఉన్నారు. ఎక్కడో సముద్రాల అవతల ఉన్న ఈ శతకంఠుణ్ణి చంపటానికి ఎవరిని నియోగిస్తాం? నూరు యోజనాల సముద్రం దాటటమే ఎంతో కష్టమయింది గదా!" అని కొంత విచారంలో పడ్డాడు.

ఇంతలో రాముడి దృష్టి తన ముందు కూర్చుని ఉన్న హనుమంతుడి పైన పడింది. అతను వెంటనే, "హనుమంతుడా. ఈ పని నీవల్లనే కావాలి. ఏకపాద రుద్రుడివి!" అన్నాడు.

హనుమంతుడు రాముడితో, "మీకీ రాక్షసులనగా ఎంత? నా మీద ఎక్కి, ఆ రాక్షసుడుండే దీవికి పోయి, వాణ్ణి చంపెయ్యండి!" అన్నాడు.



రాముడు హనుమంతుణ్ణి కౌగలించుకుని, "నీకు గల శౌర్యపరాక్రమాలు మరొకరికి వస్తాయా?" అని ఎంతగానో ప్రశంసించాడు.

ఇదంతా కంటూ, వింటూన్న సీత రాముడితో, "ఇతన్ని ఏకపాదరుద్రుడన్నారు. రుద్రుడు కోతి రూపం ధరించటానికి కారణం?" అని అడిగింది.

దానికి రాముడు ఇలా చెప్పాడు:

బ్రహ్మాండాన్ని పాలించే ఏకపాద రుద్రుడు మహారుద్రగణాలు సేవిస్తూండగా ఒకసారి తన ధ్యానశక్తితో మహావిష్ణువు రూపాన్ని చూసి, ఎన్నడూ కనిపించని ఆ రూపం తనను కాపాడే ఈశ్వరుడిదే



అయి ఉండాలనుకున్నాడు. వెంటనే అతను అక్కడి నుంచి బయలుదేరి, విశ్వమంతా తిరిగి, భూలోకానికి వచ్చి, శివుడిలో ఐక్యమయాడు. ఆ శివుడి అంశ నుంచే హనుమంతుడు పుట్టాడు.

తరవాత రాముడు శతకంఠుడిపై యుద్ధానికి సిద్ధపడ్డాడు. అతని వెంట సీత కూడా వస్తానన్నది. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులూ, సుగ్రీవ, విభీషణులూ, సైన్యమూ యుద్ధానికి కదిలారు. రాముడు హనుమంతుడి కోసం చూస్తే, హనుమంతుడు విశ్వరూపం ధరించి, భూమ్యాకాశాలూ, సమస్త దిక్కులూ నిండి కనిపించాడు. అతని పూర్తి రూపం చూడటం ఎవరికీ సాధ్యం కాలేదు. భయాశ్చర్యాలు కొలిపే, ఆ రూపాన్ని చూసి అందరూ దిగ్భ్రాంతి చెందారు.

తరవాత హనుమంతుడు భూమి కేసి వంగాడు. అతని వీపు మీద రాముడు సీతను ఎక్కించి, తాను ఎక్కి, తన వెంట వచ్చేవారినీ, వానర, రాక్షస బలాలనూ కూడా ఎక్కమన్నాడు. రాముడి సేనలకు నడకా, ప్రయాసా లేదు. వాళ్ళు హాయిగా హనుమంతుడి వీపు మీద ఆకాశయానం సాగించారు. ఆకాశాన వెళుతున్న హనుమంతుడు ఎగిరే మేరుపర్వతం లాగా కనిపించాడు.

హనుమంతుడు నాలుగు సముద్రాల మీదుగా ఎగిరిపోతూంటే రాముడు సీతకు ఒక్కొక్క సముద్రాన్నే చూపించాడు. చివరకు, శతకంఠుడు ఉండే మాయా పట్టణం కనిపించింది. ఆ నగరం చుట్టూ బంగారు ప్రాకారం ఉన్నది. హనుమంతుడి వల్ల సాధ్యమయిందిగాని, ఆ సముద్రాలు దాటి ఆ కోటను చేర రావటం మరొకరికి సాధ్యం కాదు.

మాయాపట్టణం గల లంకలో నందన వనానికి తీసిపోని వనం ఉన్నది. రాముడు హనుమంతుణ్ణి అక్కడ దిగమన్నాడు. సేనలూ అక్కడే దిగాయి. రాముడు సుగ్రీవుడు మొదలైనవాళ్ళతో, ''మీరు

ఈ రాక్షసుడి మీదికి యుద్ధానికి వెళ్లండి,'' అన్నాడు.

వెంటనే సుగ్రీవ, అంగద, విభీషణాది మహావీరులు తమ సేనలతో శతకంఠుడి నగరం పైకి యుద్ధానికి వెళ్ళారు. వానర సేనా, రాక్షససేనా కలిసి, కోటను సమీపించి, కోట చుట్టూ ఉండే అగడ్తను పూడ్చి, కోట గోడలు కూల్చి, గోపురాలు నేలమట్టం చేసి, ద్వారాల తలుపులు విరగదన్ని విజృంభించారు.

ఆ కోటను రక్షించే కాలకేయు లనే వాళ్ళకు ఈ కోతులూ, రాక్షసులూ విజృంభించటంచూసి ఆశ్చర్యంకలిగింది. ''ఈ పట్టణాన్ని పాలించేది శతకంఠుడని వీళ్ళకు తెలీదా? వీళ్లు ప్రాణాలతో ఎలా తప్పించుకుందామనుకుంటున్నారు?''అనుకుని సింహనాదాలు చేశారు.

తరవాత ఆ కాలకేయులు రకరకాల ఆయుధాలు ధరించి వానర, రాక్షససేన మీదికి వచ్చారు. వ్యాళ్ళ దెబ్బకు తట్టుకోలేక వానరసేన చెల్లా చెదరయింది. విభీషణుడు వానరులను ఆపి, తన రాక్షససేనలను పురికొల్పాడు. వారితో పాటు వానరులు కూడా ఎదురు తిరిగి కాలకేయులను ప్రతిఘటించారు. యుద్ధం తీవ్రంగా సాగింది.

ఈలోపల శతకంఠుడు శివపూజ చేస్తూ ఉండి, యుద్ధ కోలాహలం చెవులపడే సరికి, ద్వారపాలకులను, ''ఏమిటా కోలాహలం?'' అని అడిగాడు.





ద్వారపాలకులు అతనికి నమస్కరించి, "స్వామీ, ఎవరో రాజు కోతి మీద ఎక్కి ఎక్కడినుంచో నరవానర, రాక్షసులుగల సేనతో వచ్చి దిగాడు. మన కాలకేయులు వారితో యుద్ధం చేస్తున్నారు. అదే ఆ చప్పుడు," అన్నారు.

"ఎవడో రాజు కోతి మీద ఎక్కి, వానరసేనతో నానగరం మీదికి యుద్ధానికి వచ్చాడంటే లోకులు నవ్విపోరా! దేవతలే నాకు తలవంచగా ఈ రాజు వానరసేనతో ఎలా వచ్చాడు?" అని శతకంఠుడు తన మంత్రులు మొదలైన వారిని యుద్ధ సన్నద్ధులు కమ్మని, రణభేరి వేయించి, తాను కూడా యుద్ధానికి సిద్ధమయాడు.

తనతో యుద్ధానికి వచ్చిన శతకంఠుడి కిరీటమూ, అలంకారాల కాంతీ, వాడి శరీరమూ, మదమూ చూసి రాముడు అద్భుతం చెందుతూ ఉండిపోయాడు.

అది చూసి హనుమంతుడు, "స్వామీ, ఏమిటి వాణ్ణి చూసి ఆశ్చర్యపడి పోతున్నావు? నీ ప్రతాపం ముందు వీడెంత? వాణ్ణి చంపెయ్యి!" అంటూ వెళ్లి, విశాలంగా ఉన్న శతకంఠుడి రొమ్ము మీద బలంగా పొడిచాడు.

ఆ దెబ్బకు శతకంఠుడు కిందపడి, వెంటనే లేచి, ఎదురుగా ఉన్న హనుమంతుణ్ణి చూసి, "అరె, ఎంత బలం నీది! వానరుడా, మూడు లోకాలనూ హడలగొట్టే నన్నే పిడికిలి పోటుతో పడగొట్టితివే! ఎంతో తిరిగాను, ఎందరో దేవతలను యుద్ధంలో గెల్చి, ఇంతవాణ్ణి అయాను; కాని నీలాగ నన్ను ఎవరూ పడగొట్టలేదు. నీ ముష్టిదెబ్బ నేను చూశాను. నా శూలం దెబ్బ నువు చూడు!" అంటూ తన కన్న ఎక్కువ పొడుగు గల శూలాన్ని బలంగా హనుమంతుడి మీదికి విసిరాడు. దాన్ని హనుమంతుడు విరిచి పారేశాడు.

"భేష్!" అంటూ శతకంఠుడు హనుమంతుడి మీద ముసలమూ, గొడ్డలీ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు ప్రయో

గించాడు. అన్నింటినీ హనుమంతుడు విరిచేశాడు. రాముడు హనుమంతుణ్ణి చూసి ఆనందించి, తాను ఒక విల్లు తీసుకుని శతకంఠుడిపై యుద్ధానికి వచ్చాడు. రాముడితోపాటు విభీషణుడు కూడా వచ్చాడు. శతకంఠుడు వారిద్దరి బాణాలనూ దారిలోనే భగ్నంచేస్తూ, కాలితో తన్ని, ఇద్దరినీ వెళ్ళి లంకలో పడేట్టు చేశాడు.

అప్పుడు హనుమంతుడు తన తోకను నాలుగు సముద్రాల మీదుగా సేతువు కట్టినట్టు పెట్టాడు. రాముడూ, విభీషణుడూ దానిమీద వచ్చారు. వాళ్లు శతకంఠుడితో యుద్ధం ప్రారంభించగానే వానరసేనలు చెట్లూ, రాళ్ళూ విసిరాయి. శతకంఠుడు అన్నిటినీ తన అస్త్రాలతో నుగ్గు చేస్తూ వచ్చాడు. అతని ధాటికి తట్టుకోలేక అంగదుడూ, నలుడూ, నీలుడూ, ఋక్షజుడూ లాటి మేటివానర వీరులు పారిపోయారు. రాముడి తమ్ములు ముగ్గురూ ఓడిపోయారు.



అప్పుడు రాముడు సీతతో హనుమంతుడి మీద ఎక్కి, శతకంఠుడితో యుద్ధానికి వచ్చాడు. అప్పుడు శతకంఠుడు రాముడితో, ''నాతో యుద్ధం చెయ్యటమంటే రావణుడితో యుద్ధం చెయ్యటమనుకున్నావా? ఈ కోతి మీద ఎక్కి ఇంతదూరం నువు ఎందుకు వచ్చినట్టు? పైపెచ్చు సీతను కూడా తెచ్చుకున్నావెందుకు?'' అని ఆక్షేపించాడు.

రాముడు అతనిపై అస్త్రాలు వేశాడు. అప్పుడు శతకంఠులు కోట్ల సంఖ్యలో తన ఎదట ఉన్నట్టు రాముడికి తోచింది. రాముడి మహాస్త్రాలన్నీ వ్యర్థమయాయి.

హనుమంతుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను ప్రచండమైన శక్తితో శతకంఠుడి రాక్షస మూకలను నాశనం చేశాడు. అంతవరకూ యుద్ధం చేస్తున్న రాముడు విశ్రాంతి కోరినట్టుగా, తన విల్లునూ, రెండు అమ్ముల పొదులనూ

తన చెంత ఉన్న సీతకు ఇచ్చాడు. వాటిని తీసుకుని సీత శతకంఠుడితో యుద్ధం చేసింది. శతకంఠుడికి కోపం వచ్చి, ఆమె మీద తన ప్రతాపమంతా చూపుతూ యుద్ధం చేశాడు.

"రాముడు సత్యం తప్పనివాడైతే, నేను పతివ్రతనైతే ఈ బాణంతో రాక్షసుడు చచ్చుగాక!" అని సీత వింటికి బాణం సంధించి వదిలింది. దానితో శతకంఠుడు చచ్చిపడిపోయాడు. సీత తన చేతి విల్లును రాముడికి ఇచ్చి నమస్కరించింది.

రాముడు తన మణిహారాన్ని సీతకు ఇచ్చాడు. సీత రాముడితో సేనలను మోసుకువచ్చి, అంతులేని రాక్షసులను చంపి శతకంఠ రావణుడి పతనానికి ఎంతగానో సహాయపడిన హనుమంతుడికే ఆ హారాన్ని ఇయ్యమన్నది. రాముడు ఇచ్చిన హారాన్ని హనుమంతుడు తన మెడలో వేసుకొని పరమానందంతో, "సీతారాములు ప్రసాదించిన ఈ హారం నా వక్షస్థలం మీద ప్రకాశిస్తూ లోపల నా హృదయంలో సీతారాములను ఎల్లప్పుడూ నిలుపుతుంది," అన్నాడు.

అందరూ తిరిగి అయోధ్యకు వెళ్లారు. రాముడి వద్ద శలవు తీసుకొని విభీషణుడు రాక్షసులతో లంకకు వెళ్లాడు. సుగ్రీవుడు మొదలైన వానరులంతా కిష్కింధకు వెళ్లారు. హనుమంతుడు రాముడి దగ్గిరే ఉండిపోయాడు.

శతకంఠ రావణ సంహారానంతరం రాముడు నిష్కంటకంగా, ఆదర్శప్రాయంగా రాజ్యం చేస్తున్నాడు. రామరాజ్యంలో శోకమూ, క్రోధమూ, ముసలితనమూ, వైరమూ, లోభమూ, సంక్షోభమూ ఎలా ఉంటాయో మనుషులెరగరు.

రాముడి సేవలో అయోధ్యలో గడుపుతున్న హనుమంతుడికి కొన్నాళ్ళకు తన తల్లి అంజనాదేవిని చూడాలనిపించింది. రాముడి అనుజ్ఞ తీసుకొని హనుమంతుడు గంధమాదన పర్వతం దగ్గిర ఉంటున్న అంజనాదేవి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు.





# ఆసీర్‌గఢ్ రక్షణ

ఖాన్‌దేశ్ లోని ఆసీర్‌గఢ్‌దుర్గం దేశంలో కెల్లా బలమైనది. ప్రపంచంలోనే అలాటి దుర్గం లేదని కొందరి అభిప్రాయం. 900 అడుగుల ఎత్తు గల కొండ మీద ఉండిన ఆ దుర్గం శత్రుదుర్భేద్యమైనది.



ఒక సైనికుడు ఆ ప్రాంతంలో పోతూండగా ఒక లేడిని ఒక కుక్క తరమబోతే లేడి ఎదురు తిరిగి కుక్కను తరిమేసిందట. "ఇది చాలా సాహసో పేతమైన స్థలం. ఇక్కడే స్థిరపడతాను," అనుకున్నాడట ఆ సైనికుడు.



ఆ సైనికుడి మనుమడే ఖాన్‌దేశ రాజ్యం స్థాపించటానికి అక్కడి భూస్వాముల నందరినీ యుద్ధాలలో జయించాడు. అతడే బ్రహ్మాండమైన ఆసీర్‌గఢ్ దుర్గం నిర్మించాడు.



అసీర్‌గఢ్ చేత ఆకర్షితుడై అక్బరు చక్రవర్తి పెద్ద సేనతో వచ్చాడు. సైనికులు కోటచుట్టూ కందకాలు తవ్విన అనంతరం, దుర్గాధిపతి అయిన బహాదుర్‌షాను లొంగిపొమ్మన్నాడు అక్బర్.



బహాదుర్‌షా పిరికివాడు. కాని దుర్గ పాలకుడైన మలిక్ యాకుబ్ అనే అబిసీనియావాడు రాజుతో, "అక్బర్ ఎల్లకాలమూ ఇక్కడే కూర్చోలేడు. మనం దుర్గం కోసం పోరాడుదాం. ఒక సంవత్సరం తరవాతనైనా శత్రువు వెళ్ళిపోక తప్పదు," అన్నాడు.



దుర్గంలో యాభైవేలమంది జనం ఉన్నారు. వారు మూడువేల ఫిరంగులను మొగలు సైనికుల మీద పేల్చారు. యాకుబ్ యుద్ధం నడిపాడు.

కోటలో కొన్ని ఏళ్ళకు సరిపడా ఆహారం ఉన్నది. బహాదుర్‌షా లొంగి పోరాదని యాకుబ్ అన్నాడేగాని, రాజుకు ధైర్యం చాలటంలేదు. ఒకరోజు ఆయన యాకుబ్ కొడుకులను, ముకరాబ్, బహాదుర్ ఖాన్‌లను వెంటబెట్టుకుని కొండదిగి, అక్బరుకు లొంగిపోయాడు.





అక్బర్ బహాదుర్‌ఖాన్‌ను తన అధీనంలో ఉంచుకుని, ముకరాబ్ ద్వారా, కోటను తన అధీనం చేస్తే జరిగినదంతా క్షమిస్తానని కబురు చేశాడు. ముకరాబ్ తనతో ఈ మాట చెప్పినప్పుడు, "నీ పిరికి ముఖం నాకు చూపకు!" అన్నాడు యాకుబ్.

ముకరాబ్ అక్బర్, బహాదుర్ ఖాన్‌ల వద్దకు తిరిగి వచ్చాడు. వాడు శుభ వార్త తెచ్చాడని అక్బరు ఆశపడ్డాడు. కాని ముకరాబ్ చురకత్తి తీసి, పొడుచుకుని, ఆత్మహత్య చేసుకున్నాడు.





కోటలో ఏడుగురు రాజకుమారులున్నారు. బహదుర్‌షా లొంగిపోయాడు గనక, యాకుబ్ వారిని పిలిచి, వారిలో ఎవరు యుద్ధం కొనసాగిస్తే వారిదే సింహాసనం అన్నాడు. ఏడుగురిలో ఒక్కడూ మాట్లాడలేదు.



క్రమంగా అసీర్‌గఢ్ అధికారులందరూ మొగలుల పక్షం తిరిగిపోయారు. పిరికి వాళ్ళూ, తిరోగాములూ కోటను రక్షించ లేరని యాకుబ్ ఎరుగును. అతను తనకోసం గొయ్యి తవ్వుకుని, ఆప్తులకు వీడ్కోలు చెప్పి, విషం తాగి మరణించాడు.



కోట మొగలుల వశమైనప్పుడు, యాకుబ్ వారికి చిక్కలేదు. తన బొందిలో ప్రాణం ఉన్నంత కాలమూ కోటను కాపాడతానని అతను ప్రమాణం చేసి ఉన్నాడు. ఆ పని అసాధ్యమని తోచగానే తన ప్రాణం తీసుకున్నాడు. ఉద్యోగులకు లంచాలు పెట్టి మొగలులు కోటను వశపరచుకున్నారు గాని, కోటలో కొన్ని ఏళ్ళకు సరిపడా ఆహారం ఉన్నది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఒక ఊరి వాళ్ళు నలుగురు తీర్థయాత్రలకు బయలుదేరారు. వారిలో ఒకడు వాగుడుకాయ. వాళ్ళు పగలు ప్రయాణం చేస్తూ, రాత్రి ఏ అరుగు మీదనో పడుకుంటున్నారు. ఒక రాత్రి వాళ్ళు రామాపురం అనే గ్రామంలో గంగమ్మ అనే ఇల్లుగలావిడ ఇంటి అరుగు మీద పడుకున్నారు.

మర్నాడు రాత్రికి వాళ్ళు మరొక ఊరు చేరి, గౌరమ్మ అనే ఇల్లాలిని, "అమ్మా, యాత్రికులం! ఈ రాత్రికి మీ అరుగు మీద పడుకోనియ్యి," అన్నారు.

గౌరమ్మ అందుకు ఒప్పుకోవటమేగాక, వాళ్ళకు కంబళ్ళూ, మంచి తీర్థమూ కూడా ఏర్పాటు చేసింది.

వాగుడుకాయ ఆమెతో, "మీరెంత మంచివారండీ! రామాపురంలో డబ్బు తీసుకునిగాని గంగమ్మ మమ్మల్ని అరుగు మీద పడుకోనియ్యలేదు," అన్నాడు.

గౌరమ్మ గంగమ్మకు తోడికోడలు. ఆమె వెంటనే, "గంగమ్మ అరుగు బంగారందీ, నాది మట్టిదినా? ఆమె కిచ్చినంత డబ్బు నాకూ ఇయ్యండి," అని డబ్బు వసూలు చేసింది.

—మాదుపాక, మంజురాణి

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు జనవరి 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, మార్చి చందమామలో ప్రకటించబడును.

---

నవంబర్ నెల పోటీ ఫలితం: శుష్కప్రియాలు-శూన్య హస్తాలు

గెలుపొందిన వారి పేరు: ఎం. ఇందిరాదేవి, గార్ల. (ఖమ్మం జిల్లా)

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.







G. Srinivasa Murthy — M. Natarajan

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–**26.**

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దూరంగా వుంటే నయం

రెండవ ఫోటో : దగ్గరకొస్తే భయం

పంపినవారు : చిల్లర సాంబశివరావు, గుంటూరు-1

**బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

**Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.**

# వినతి

ఆంధ్రదేశంలోని కొన్ని జిల్లాలు ఈ మధ్య అకస్మాత్తుగా పెను తుఫానుకు బలయి ఎంతగానో నష్టపడ్డాయి. వేలాది ప్రజలు ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇళ్లు, పంటలూ ధ్వంసమైపోయాయి. ఎన్నో సోదర కుటుంబాలు నిలవ నీడ లేక అల్లాడి పోతున్నాయి. పలువిధాల నష్టపోయిన సాటిమానవులకు, సహాయ పడవలసిన విధి, కర్తవ్యం మనందరిమీదా వున్నది. ప్రతివారూ ఈ 'సహాయం' తమ తక్షణ కర్తవ్యంగా భావించి - తమ శక్త్యానుసారం ''ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిధి''కి విరాళంగా పంపి, సాటి ప్రజలను ఆదుకోవలసిందిగా 'చందమామ' అభ్యర్థిస్తున్నది.

కొత్తది!

# అముల్
## మాల్ట్-కోకో పానీయం

# న్యూట్రాముల్

## ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు

అముల్ బలాన్నిచ్చే న్యూట్రాముల్ – ఇంతకుమును పెన్నడూ అందించబడని ఆరోగ్యాన్నిచ్చే పానీయం సమర్పిస్తోంది. సమృద్ధిగా పాలు, శుద్ధమైన మాల్ట్, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజములుగలది, ప్రతి కప్పు ఆరోగ్యాన్ని, శక్తిని పెంపొందిస్తుంది.

మరిక దీని రుచి! అమ్మమ్మ! ఎంతో ఎక్కువ కోకో మరెంతో ఎక్కువ పాలు.

సమృద్ధియైన నురుగు గల కోకో గలది. న్యూట్రాముల్ అముల్‌వారి కొత్త పాలు మరియు ఆహారాల ప్రోసెసింగ్ కేంద్రంలో—ప్రపంచంలో మేలైన వాటిలో ఇది ఒకటి–రూపొందించబడుతోంది

ప్రతి న్యూట్రాముల్ డబ్బాలో 500 గ్రాముల సరకు ఉంటుంది. అంటే ఇతర వాటికన్న 50 గ్రాములు (5 కప్పులు) అదనం అన్న మాటేగా.

న్యూట్రాముల్ నేడే వాడి చూడండి.

Nutramul
AMUL'S NOURISHING DRINK
500g. Net

ప్రతి డబ్బాలో 50 గ్రాముల ఎక్కువ సరుకు





మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

daCunha/Nutra/1 P Tel